ఫెడరేషను—కాంగ్రెసులో చీలికలా?

Regd. No. M. 382

# నవ శక్తి

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పత్రిక

సంపాదకుడు : మద్దూరి అన్నపూర్ణయ్య

సంపాదకవర్గం

కంభంపాటి సత్యనారాయణ. పుచ్చలపల్లి సుందరయ్య.

చుక్కల వెంకట రామయ్య. మద్దుకూరి చంద్రశేఖరరావు.

సంపుటం 1 | బుధవారము 13—7—38 బెజవాడ | సంచిక 29



జమీందారులు కృష్ణాజిల్లాలో రైతులపై దౌర్జన్యము గావించిన ప్రాంతాలలో, రైతునాయకులగు ఇందులాల్ యాగ్నిక్, రంగా, వాసుదేవరావు, గార్ల సంచారం. వందలకొలది రైతులు సమావేశమై ప్రతి స్థలములోనూ, వీరి ఉద్బోధలను విన్నారు.

# నవశక్తి

చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ 3—0—0 |
| అర్ధసంవత్సర చందా | 1—10—0 |
| విడిప్రతి | 0—1—0 |

* * *

అడ్వర్టైజుమెంటు రేటులు

"కాలం" వెడల్పు 2" (రెండు అంగుళాలు)

| | |
|---|---|
| కాలంలో 1" మొదలు 20" వరకు ప్రతి అంగుళానికి | రూ. 0—6—0 |
| 20"—100" వరకు .. | 0—4—0 |
| 100" పైగా .. | 0—3—0 |
| పాతిక పేజీకి | 3—0—0 |
| సగము పేజీకి | 6—0—0 |
| ఒక పేజీ మొదలు 15 పేజీల వరకు పేజీ ఒకటికి | 10—0—0 |
| 15 పేజీలకు పైగా పేజీ 1కి | 7—8—0 |

ఈ వరకు అంగీకరించిన కంట్రాక్టులకు ఈ రేట్లు వర్తించవు.

ఈ రేట్లలో కన్సెషన్సు కమిషను ఏమీ ఉండవు.

* * *

చందాదారులను చేర్పించాలి!

ఆం॥ రా॥ సో॥ పార్టీ కార్యనిర్వాహక వర్గము, మొన్న సమావేశమైనపుడు యీ క్రింది ప్రకారం ప్రతిజిల్లా పార్టీ జూలై నెలాఖరులోపల చందాదారులను చేర్పించ వలసినదిగా తీర్మానించింది. మొదటి వారమునకు చేర్పించిన చందాదారుల సంఖ్యనుకూడ క్రిందనిస్తున్నాము. పార్టీ సభ్యులు, సోషలిస్టు అభిమానులు, ప్రజాసామాన్యము, ఈ "కోటాలు" పూర్తి అయ్యేటట్లు పనిచేస్తారని ఆశిస్తున్నాం.

| జిల్లా | జూలైకోటా | మొదటి వారంలో చేర్పించినవి. |
|---|---|---|
| విశాఖపట్టణం | 20 | 0 |
| తూర్పు గోదావరి | 75 | 0 |
| పశ్చిమ గోదావరి | 250 | 0 |
| కృష్ణా | 150 | 3 |
| గుంటూరు | 125 | 0 |
| నెల్లూరు | 50 | 13 |
| చిత్తూరు | 20 | 0 |
| కడప | 5 | 0 |
| కర్నూలు | 20 | 0 |
| అనంతపురం | 5 | 0 |
| బళ్లారి | 5 | 0 |
| ఇతర స్థలాలు | 25 | 0 |
| | 750 | 16 |

* * *

చందాదారులకు విజ్ఞప్తి.

కొంతమంది తాము మా ఏజెంట్లకు చందాడబ్బు ఇచ్చామనియు, పత్రిక రావడము లేదనియూ జాబులు వ్రాస్తున్నారు. మా ఏజెంట్లు విడిప్రతులు నమ్మడానికే మేము బాధ్యులము. వారికి చందా చెల్లించినవారు వారివద్ద నుండియే పత్రిక తీసికొనవలెయును. లేదా ఆఫీసుకు తిన్నగా చందాను మనియార్డరు ద్వారాగాని లేక కాన్వాసింగు ఏజెంట్ల ద్వారాగాని పంపించవలెయును. దీనిని అందరు గమనించ ప్రార్థన.

మా కాన్వాసింగు ఏజెంట్లు రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహక సభ్యులు, జిల్లా పార్టీల కార్యనిర్వాహక సభ్యులు, పట్టణ, తాలూకా పార్టీల కార్యదర్శులు.

* * *

చందాలు చెల్లించండి!

ఇంతవరకునూ చందాకట్టని చందాదారులు ఈ నెలాఖరు లోపల చెల్లించనిచో పత్రిక ఆగస్టునుండి పంపబడదు. చందాదారులు తమ చందాను వెంటనే చెల్లించి పత్రికకు సాయపడ వలసినదని ప్రార్థించుచున్నాము.

మేనేజరు,
నవశక్తి కార్యాలయము,
గవర్నరుపేట, బెజవాడ.

---

## విశ్వసాహిత్యమాల

తెలుగులో సోషలిస్టు గ్రంథాల్ని ప్రకటించే గ్రంథమాల.

ఇప్పుడే వెలువడ్డాయి.

లెనిన్ ఉపదేశాలు. వెల 6 అణాలు
(పాములపర్తి రచన కనువాదం.)

పారిస్ కమ్యూన్. వెల 6 అణాలు
(లెనిన్ రచన కనువాదము)

ముచ్చటైన బైండుతో, ఫొటోలతో, చక్కని భాషలో, నూరుపుటలకు పైబడిన గ్రంథాలే యివి రెండూకూడా. వెంటనే వ్రాయండి. ఆలసిస్తే ఏమో!....

త్వరలో వెలువడుతూన్న గ్రంథాలు.

'నాడు-నేడు' అడయంకో.
'బీక్కుదున్నేరు.' షోలోకోవ్.
'ఇండియన్ మ్యూటినీ 1857'
'అక్టోబరు విప్లవం' లెనిన్.

మీకేమైనా రాజకీయ గ్రంథాలు కావాలా? అయితే,

వెంటనే మాకు వ్రాయండి.

మహీధర కృష్ణమోహన్
విశ్వసాహిత్యమాల,
ముంగండ,
(via.) అంబాజీపేట, తూ. గోదావరి.

---

విన్నారా! ఈ వీరగాధ!

## అన్నా

జర్మనీలో కార్మికులు, కమ్యూనిస్టులు సల్పిన పోరాటం—త్యాగం—విప్లవం—కనులకు కనబడేటట్లు చిత్రించాడు నవలాకరుడు 'అన్నా'లో.

అశ్వినీకుమార్ దత్తుగారు మంచి రసవంతంగా అనువదించి ఆంధ్రులకు అందించారు. ఇలాంటి వీరగాధను చదవండి! ధన్యులుగండి!
300 పేజీలు.

అర్ధ రూపాయే సుమా!

మీ కాపీకి వెంటనే ఆర్డరు యివ్వండి. ఏజన్సీ కావలసినవారు అణా బిళ్లతో వ్రాయండి. పుస్తకము కావలసినవారు పది అణాల ఆరు పైసలు తపాలా బిళ్లలు పంపించండి.

దర్భా శ్రీరామమూర్తి,
న్యూస్ ఏజంటు,
భీమవరం; పశ్చిమ గోదావరి.

---

ప్రజలకు ! ప్రచారకులకు !!

## సుప్రసిద్ధముగు జాతీయ గ్రంథములు.

1. ప్రభుత్వ ధనము — మన బీదతనము
   జె. సి. కుమారప్పగారి ఆంగ్ల గ్రంథమున కనువాదము. ఇటీవల ప్రభుత్వ నిషేధము తొలగింపబడినది.
2. గాంధీ మహాత్ముని లండను ఉపన్యాసములు
   మహాత్మాజీ లండనులో రెండవ రౌండుటేబిలు సమావేశము నందొసగిన యుపన్యాసముల కనువాదము. రచయిత శ్రీ తిమ్మరాజు సత్యనారాయణగారు ఎం. ఎ.,
3. హరిజన సమస్య
   అతి కంకరుల నాటినుండి నేటివరకును యీ యుద్యమాభివృద్ధిని విపులముగా చర్చించిన యుత్తమ గ్రంథము. రచయిత: శ్రీ నందూరి కృష్ణమాచార్యులు బి.ఏ.
4. ఆధునిక రాజ్యాంగ సంస్థలు
   (రెండు భాగములు) నవీన రాజ్యాంగ విధానములన్నియు ఇందు చర్చింపబడెను. రచయిత: ఆచార్య రంగాగారు.
5. చైనా జాతీయోద్యమము (రెండు భాగములు)
   ఆదినుండియు చైనా జాతీయోద్యమ చరిత్రము విశదీకరించు ముఖ్యగ్రంథము. రచయిత; శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు.

ఈ 7 గ్రంథములను విడివిడిగా ప్రతి 1 కి రు 0—8—0 లును, అన్నియు నొకేసారి కోరినచో మూడు రూపాయిలును మాత్రమే.

ప్రతులకు:—

ఆంధ్ర ప్రచారిణి లిమిటెడ్, కాకినాడ.

---

## అతివాద గ్రంథమండలి.

| | చందాదారులకు |
|---|---|
| 1922 మన్యంలో రైతుల తిరుగుబాటు (అల్లూరి సీతారామరాజు) | 0-12-0 |
| ఇతరులకు | (1-0-0) |
| విలువ, ఖరీదు, లాభము. | 0-5-0 |
| ఇతరులకు | (0-8-0) |
| స్టాలిన్ ఉపన్యాసము. నూతన రాజ్యాంగవిధానం. | 0-5-0 |
| ఇతరులకు | (0-8-0) |
| రానున్నది— 1937 లో మాస్కో | 0-5-0 |
| ఇతరులకు | (0-8-0) |

(పోష్టు ఖర్చులు ప్రత్యేకముగా భరించవలెను.)

వలయువారు:—

సి. పి. సారధి,
మేనేజరు.
అతివాద గ్రంధమండలి.
గుంటూరు.

---

## ఆదర్శ గ్రంథ మండలి.

కారల్ మార్క్సుది—
కమ్యూనిష్టు కరపత్రం(నిషేధింపబడినది)

లెనిన్ ది—
సామ్రాజ్యవాదము (నిషేధింప బడినది)

| | |
|---|---|
| ఏజంజిల్సుది—సామ్యవాద సిద్ధాంతాలు | 0—2—0 |
| మాక్సింగోర్కీది— అమ్మ (నిషేధంపోయింది) | 1—8—0 |
| క్రోపాటకిన్ ది—మనధనం (అయిపోయింది) | |
| టాలుస్టాయిది—కర్షకునికాలగతి | 0—1—0 |
| తుమ్మలవారిది—కామ్రేడ్ డిమిట్రాఫ్ | 0—2—0 |
| లింగయ్యవి—దేవీజోన్ (జీవితము) | 0—8—0 |
| దీవేలరా (జీవితము) | 0—8—0 |
| వలసదేశాల సమస్య | 0—1—0 |
| స్టాలిన్—లడ్విగ్‌తో సంభాషణ | 0—1—6 |

ఆదర్శ గ్రంథ మండలి
యలమర్రు (కృష్ణాజిల్లా)
లేక
నవశక్తి కార్యాలయం.
బెజవాడ, అని వ్రాయండి.

---

## వేంకట్రామా అండుకో

మావద్ద సమస్త సంస్కృత, ఆంగ్ల, ఆంధ్రహిందీగ్రంథములు, స్కూలు పుస్తకములు, నాటకములు, వైద్యగ్రంథములు వగైరా సరసమైన ధరలకు దొరకును. కేటలాగు ఉచితముగ బంపెదము.

భగవద్గీత :— శ్రీ శంకర భాష్యము శ్రీ కళ్యానంద భారతిగారి విపుల ఆంధ్ర టీకాతాత్పర్యములతో— 3—0—0.

హెడ్డాఫీసు:—ఏలూరు. బ్రాంచీలు : మద్రాసు, తెనాలి, బెజవాడ, పాలకొల్లు, సికిందరాబాదు. (వైజాము.)

వేంకట్రామ అండు కో,
బ్రాంచి : రాజమండ్రి.

---

## మాప్లా తిరుగుబాటు

మలబారు రైతులు 5 నెలలు సాగించిన అప్రతిమాన సాహస యుద్ధ చరిత్ర.

గ్రంధకర్త:- తుమ్మల వెంకట్రామయ్య
వెల ఒక అణా.

నవశక్తి కార్యాలయం,
గవర్నర్‌పేట, బెజవాడ

---

## ప్రభ

హిందీలో వెలువడే మార్క్సిస్టు మాస పత్రిక.

భారతదేశ మందలి సుప్రసిద్ధ కమ్యూనిస్టులు సోషలిస్టులు వ్యాసాలు వ్రాస్తున్నారు. హిందీ వచ్చిన ప్రతి వ్యక్తి చదువాలసిన పత్రిక.

సం॥ చందా 1—8—0
విడి ప్రతి 0—2—0

మేనేజరు "ప్రభ"
దైర్‌హనా, అలహాబాదు.

# "బ్రిటిషు సామ్రాజ్యం అస్తమించుట మన కళ్లతో మనం చూస్తున్నాం"



## ప్రపంచ యుద్ధం వస్తే ఇండియాలో పన్నుల నిరాకరణ ప్రారంభిస్తాం. సైనికులు, రైతులు ఏకమవుతారు.

— లండనులో జవహర్లాల్

### కమ్యూనిస్టు విలేఖరితో సంభాషణ.

జవహర్లాల్ నెహ్రూ లండన్‌లో ఉండగా, బ్రిటిషు కమ్యూనిస్టు పార్టీ ప్రతిక అగు "డెయిలీ వర్కర్" విలేఖరి ఆయనను కలుసుకొని, వివిధ రాజకీయ సమస్యలను గురించి సంభాషించాడు. సంభాషణలో జవహర్లాలు యీ క్రింది విధంగా తన అభిప్రాయాలను తెలియ పరచాడు.

"భారత దేశాన్ని గురించి అందరును గమనించ వలసిన విషయమేమనగా, అంతర్జాతీయ సమస్యలను మేము అత్యధికమైన ఆతురతతో పరిశీలించు చున్నాము. దీనికి కారణమేమనగా, భారతదేశ సమస్య ప్రపంచ సమస్యలో ఒక భాగమై యున్నది.

### భారతీయుల కృత నిశ్చయము.

"భారతదేశ సమస్యను అర్థం చేసుకోవాలంటే, ప్రప్రథమంగా తెలుసుకోవలసిన ప్రధాన విషయము, గ్రేట్ బ్రిటన్‌నుండి మేము సంపూర్ణమైన ఆర్థిక, రాజకీయాధికారాన్ని లాగుకొనుటకు కృతనిశ్చయులై యున్నాము. బ్రిటన్ దేశం యెట్టి చిక్కులలోనైనా యిరుక్కున్నపుడు దానిని మేము ఉపయోగించుకొందుము. ఈ విధముగా మేము మా స్వాతంత్ర్య పోరాటాన్ని ముందుకు తీసుకొనిపోదుము.

"జకోస్లావేకియాపై జర్మనీ, ఇటలీ ప్రభుత్వాలు దండెత్తి వస్తే, గ్రేట్ బ్రిటన్ జర్మనీ ఇటలీల కెదురుగా ఒకవేళ పోరాడినప్పుడు సహితము భారతదేశంలో బ్రిటిషు ప్రభుత్వం తమ నిరంకుశత్వాన్ని ఎక్కువ చేస్తుంది.

ఇట్టి ప్రయత్నాలను భారతదేశ ప్రజలు యెదుర్కొంటారు. దీనికి కారణములు రెండు. మొదటిది సంపూర్ణ స్వాతంత్ర్యం మాఆదర్శం. మా అంగీకారం లేకుండా మానెత్తిని యుద్ధాన్ని రుద్దితే, అట్టి యుద్ధంలో మాప్రజలు పాల్గొనరు. భారతీయులు బ్రిటిషు పరిపాలనక్రింద ఉన్నంత కాలం, అట్టి అంగీకారాన్ని మావద్ద పొందరు. కాబట్టి మా ప్రథమ కర్తవ్యమేమనగా మేము స్వేచ్ఛను సంపాదించుకోవాలి.

"రెండవ కారణం స్పెయిన్, చైనా దేశాలయందలి అనుభవాలనుబట్టి ఒక్క విషయం స్పష్టంగా తెలుసుకోవచ్చు. యుద్ధంలో నిజమైన ఫేసిస్టు ప్రతికూలశక్తులు నాయకత్వంలో ఉన్నప్పుడే అనగా వారి యాజమాన్యమే అమల్లో ఉన్నప్పుడు ఫేసిస్టుదేశాలను ఓడించవచ్చును. ఇతర పరిస్థితుల్లో అది సాధ్యంకాదు.

కాబట్టి, ఒకవిధంగా గ్రేట్‌బ్రిటన్ యందలి ఫేసిస్టు ప్రతికూల శక్తుల ఎదుర్కొనే సమస్యయే మమ్ముకూడ యెదుర్కొంటుంది. నిజమైన ఫేసిస్టు ప్రతికూల పద్ధతులలో యుద్ధం సాగుతూంటే, మా సమస్య — మీ సమస్య ఒకటే. అప్పుడు మేము మాస్వాతంత్ర్యము కొరకై చేయు పోరాటం మీసమస్య పరిష్కారం కావడానికి సహాయపడుతుంది.

### పన్నుల నిరాకరణ

"ఏవిధంగా బ్రిటిషు ప్రభుత్వంతో సహాయ నిరాకరణ మొనరిస్తామంటే, కొద్ది సంవత్సరాల నుంచి భారతదేశమందలి పరిస్థితులు విపరీతంగా మార్పుచెందాయి. అన్నిటికంటె సులభమైన మార్గమేమనగా, రైతులచే పన్నులు నిరాకరణం చేయించడమే. పన్నులిచ్చుట మానివేయవలసిందని కాంగ్రెసు హెచ్చరిస్తే వెంటనే ప్రారంభమయిందన్నమాటే పెద్ద పోరాటం!

### భారతీయ సైనికులో?

"మరొక విషయం. నేటి భారతీయ సైనికులు ఎక్కువగా రైతులనుండి వచ్చారు. సెలవుమీద ఉన్నప్పుడు వారు తమతమ గ్రామాలకు వెళ్ళుతూఉంటారు. అక్కడ తమవంటి ప్రజలతో సంబంధ బాంధవ్యాలను కలిగి ఉంటారు. కాబట్టి, దేశంలో పెద్దరైతు ఉద్యమమే వస్తే, దాని ఫలితం సైనికులపైకూడా ప్రసరింపకుండా చేయుట బ్రిటిషువారికి సాధ్యమైన పనిగాదు. నేడు సైన్యం చాలా తరిఫీదుగలదే. కాని, ఆ సైనికులకు రైతుజనానికీ సంబంధం ఉండడంవల్ల, అట్టి సైన్యంపై బ్రిటిషువారు ఆధారపడి యుండలేరు.

"కాబట్టి, బ్రిటన్ దేశమందలి ఫేసిస్టు ప్రతికూలు రందరు గ్రహించవలసిన విషయమేమనగా, సామ్రాజ్య వ్యతిరేక పోరాటాన్ని అశ్రద్ధతో చూస్తే, ఫేసిస్టు ప్రతికూల పోరాటాన్ని జయంగా సాగించలేరు. స్పెయిన్, చైనా దేశాయందుల ఫేసిస్టుల బాంబు ప్రయోగాలను ఖండిస్తూ, భారతదేశంయొక్క పశ్చిమోత్తర సరిహద్దులో బ్రిటిషువారి బాంబు ప్రయోగాలను సహించుట అసాధ్యమైన పని"

### బ్రిటిషు సామ్రాజ్య వినాశనం

లండన్ క్వీన్సుహాలులో జవహర్లాల్ 4000 మంది ప్రజలయెదుట ఉపన్యసిస్తూ, నేడు గ్రేట్‌బ్రిటన్ అనుసరిస్తూన్న విదేశ రాజ్యాంగ నీతి తప్పనిసరిగా బ్రిటిషు సామ్రాజ్య వినాశనానికి హేతువౌతుందని చెప్పాడు.

"బ్రిటిషు సామ్రాజ్యం అస్తమించుట మన కళ్ళతో మనం చూస్తున్నాం" అని జవహర్లాల్ ఘంటాపథంగా పలికాడు.

ప్రపంచం ఒక అవకతవక పద్ధతి ననుసరిస్తోందని ఆయన అన్నాడు. మరియు:

"మనమంతా ఒక బ్రహ్మాండమైన విప్లవ వాతావరణంలో ఉన్నాం. ఇది మార్పులు అతి త్వరితంగా వస్తూ ఉన్న కాలం. భారతదేశం స్వయంగా తన సమస్యలను పరిష్కరించుకొంటోంది. కాని, ప్రపంచ సమస్యలను విడిచిపెట్టి తన సమస్యను జయప్రదంగా పరిష్కరించుకోలేదు. ప్రపంచంలో నేడు జరుగుతూన్న పెద్ద విప్లవ పోరాట పంథాను వ్యతిరేకించి ఇండియా తన పోరాటాన్ని సాగించుకోలేదు"

### సంపూర్ణ స్వరాజ్యం ఎంతో దూరంలో లేదు

భారతీయులచే ఎన్నుకోబడిన ప్రజా ప్రతినిధి పరిషత్తునకే భారత రాజ్యాంగాన్ని నిర్మించగల హక్కు గలదనియు, స్వరాజ్య పోరాటాన్ని ముందుకు తీసికొని పోవుటకే కాంగ్రెసువారుమంత్రి పదవులు స్వీకరించదరనియు, నేడు కాంగ్రెసు యొక్క బలం ప్రపంచ మందంతటను గుర్తించబడుతున్న దనియు, దూరదృష్టి గల రాజ్యాంగవేత్తలు భారతదేశం యొక్క సంపూర్ణ స్వరాజ్యం ఎంతో దూరంలో లేదని అభిప్రాయ పడుచున్నారనియు, అప్పుడే వారు ఇండియా యొక్క స్నేహాన్ని సంపాదించుటకెన్నో ఉపాయము లాలోచించు చున్నారనియు అతడు పలికెను.

గ్రేట్ బ్రిటన్ నేడు చేస్తూన్న ఆయుధ నిర్మాణ సన్నాహం చూస్తే, బహుళ రష్యా మీదికీ ఉపయోగ పడుతుందని జవహర్లాలు చెప్పినప్పుడు సభ్యులలో కొందరు గోలచేశారు.

### ఇండియాలో పౌరసత్వ హక్కులు.

జవహర్లాల్ బ్రిటిషు పౌరస్వాతంత్ర్య సంఘ సభ్యులతో విందారగిస్తూ, ఇండియాలో పౌరసత్వ హక్కులను గూర్చి ముచ్చటించెను. రెండు మూడేండ్ల క్రితం యివిలేనే లేవని అతడు తెలిపెను. అప్పటి ఆర్డినెన్సులు, చట్టములు వాటిని పూర్తిగా నిరోధించేవి. కాంగ్రెసువారు అధికారం స్వీకరించినప్పటినుంచి కొన్ని రాష్ట్రాలలో చాల మార్పులు వచ్చెను. కాంగ్రెసు మంత్రి వర్గముల ప్రథమ కర్తవ్యం వీలయినంత వరకు ప్రజలు పౌరసత్వ హక్కులను తిరిగి వారికీయుట. అందుచే రాజకీయ ఖైదీలను విడుదల చేశారు. దానిపై గవర్నర్లతో తగవు వచ్చింది. చివరకు గవర్నర్లు, వైస్రాయి లొంగిపోవలసి వచ్చింది, లేనిచో ప్రమాదం సంభవించేదే; రాజ్యాంగ విధానం భగ్నమయ్యేది. గవర్నర్లే పరిపాలనా బాధ్యత వహించి ఇంచుమించు సైనిక శాసనంతో పరిపాలన చేయవలసి వచ్చేది.

ముఖ్యమైన మార్పేమనగా, యిప్పుడు నిరుపేద రైతు తనపైఉండే పెద్ద భారం తొలగినట్లును; పోలీసులు తనను బాధించలేరనియు; స్వేచ్ఛగా మాట్లాడవచ్చుననియు అతడు భావిస్తున్నాడు.

కాంగ్రెసేతర రాష్ట్రాలలో పూర్వపు స్థితియే కనపడుతుంది. బెంగాలులో రాజద్రోహ నేరములకై కేసులు అనేకం ఉన్నాయి. అనేకమంది డెటిన్యూలు విచారణలేకయే నిర్బంధంలో ఉన్నారు. వారిసంఖ్య వృద్ధి చెందుతోంది.

స్వదేశ సంస్థానములలో పౌరసత్వపు హక్కుల సమస్య మొదటినుంచీ యెంతో పాడుగాఉంది. అక్కడి పరిస్థితులలో యెట్టి మార్పులు కనపడుటలేదు. కొన్ని సంస్థానాలలో స్పష్టమైన ఫేసిస్టు లక్షణాలున్నాయి.- అని జవహర్‌లాల్ చెప్పాడు.

### మనవి.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీ సభ్యులకు, ప్రజాసామాన్యానికి, ఒక మనవి.

(1) పత్రికను గురించి మీ అభిప్రాయాలను, విమర్శనలను, సూచనలను ప్రతివారమూ పంపుతూ పత్రికాభివృద్ధికి తోడ్పడాలి.

(2) పత్రికకు వ్యాసములు వ్రాస్తూ సహాయపడాలి.

(3) పత్రికకు ఆంధ్రరాష్ట్ర మందంతట నుండి రైతులకు, కార్మికులకు, ప్రజాసామాన్యానికి సంబంధించిన వార్తలు, నివేదికలు పంపి సాయపడాలి.

(4) స్వాతంత్ర పోరాటము వివిధ రంగాలలో ఏ విధంగా అభివృద్ధి చెందుతున్నదో తెలియజేయాలి.

—సంపాదకుడు

# నవశక్తి

13—7—38 బుధవారం

## ఫెడరేషను సమస్యపై కాంగ్రెసులో చీలికలా?

హరిపుర కాంగ్రెసు తీర్మానము స్వదేశ సంస్థానములు పూర్తిగా సంస్కరింపబడనిదే, ఫెడరేషను రావడం ఏమాత్రం సాధ్యంకాదని ప్రకటించింది. అప్పుడే సోషలిస్టులు, కాంగ్రెసులోని తదితర అతివాదులు, స్వదేశ సంస్థాన ప్రతినిధులను ఎన్నుకొనే పద్ధతిలో మార్పులెస్తే ఫెడరేషనును అంగీకరించడానికి ఇది దారితీస్తుందని హెచ్చరించి సవరణలు పెట్టారు. అవి త్రోసివేయబడ్డాయి.

హరిపుర కాంగ్రెసు తరువాత దేశమందు అనేక ఘటనలు జరిగాయి. బీహారులో రైతులకు నష్టదాయకమైన కాంగ్రెసు జమీందారు ఒడంబడిక; కాంగ్రెసు ప్రతిష్టను భగ్నం కావించడానికి రైతులపై దేశమందంతా జమీందారుల దౌర్జన్యాలు-వానిని కాంగ్రెసు మంత్రులు అణచివేయడానికి సరియైన పద్ధతుల నవలంబించక పోవడమేగాక రైతు సేవకులపై 107 వ సెక్షను ప్రయోగము; రోజు రోజుకు బాధలు ఎక్కువై రైతులు వానిని తొలగించుకోడానికి పోరాటాలు ఆరంభిస్తే, వానినివలదని వారిస్తూరావడము; ఢిల్లీ అసెంబ్లీలో కార్మికుల సమ్మె హక్కును భగ్నం చేసే కార్మిక తగాదా చట్టము విషయములో కాంగ్రెసు వారు తటస్థంగా ఉండడం; బొంబాయిలో సమ్మెహక్కును భగ్నమునావించే బిల్లును కాంగ్రెసు మంత్రివర్గమే తీసుకరావడము; దాని ననుసరించి మద్రాసులోనూ, తదితర కాంగ్రెసు రాష్ట్రాలలో కూడ కార్మిక సమ్మెహక్కుల భంగము కలిగే చట్టాలు చేసేప్రయత్నాలు; చీరాల కాల్పులు; కాన్పూరులో బ్రహ్మాండమైన సమ్మెజేసి కాంగ్రెసు మంత్రివర్గాన్ని బలపరుస్తూ ఉంటినా, మజూరు సభచే కార్మికుల సమ్మెలను సంకుచిత పర్చడానికి ఒప్పుకొనేటట్లు చేయడమేగాక కార్మికులకు సౌకర్యములు గలుగజేసే సోషల్ లెజిస్లేషన్ రాష్ట్ర ప్రభుత్వము చేయదనికూడ ప్రధాని పంతు వాగ్దానము చేయడం; కాంగ్రెసు రాష్ట్రాలలోకూడ ఇంకను రాజకీయ ఖైదీలు నిర్బంధమందు ఉండటము; పోలీసుల దౌర్జన్యాలు, ఒత్తిడి ఇంకను తగ్గకపోవడం; పైగా రాజాజీ లాంటివారు ప్రభుత్వపు టుద్యోగీయులను ప్రశంసించడం; ఇవన్నీ హరిపుర కాంగ్రెసు తరువాత జరిగిన ఘటనలు.

కాంగ్రెసు మంత్రులు ఈ పొరపాటుల నావించడానికి బ్రిటిషు ప్రభుత్వం యొక్క, వారి నిరంకుశోద్యోగులయొక్క (బురాక్రసీయొక్క) ఒత్తిడి ప్రధాన కారణం. కాని దానితోపాటు కాంగ్రెసులో మితవాద నాయకులు కొద్ది మార్పులతో తాత్కాలికంగానైనా ఫెడరేషనను అంగీకరించ వచ్చుననెడి భావముకూడ దీనికి సాయపడుతూ వచ్చింది. ఈభావమే మద్రాసు, మధ్య పరగణాల శాసనసభలలో ఫెడరేషనును గురించిన తీర్మానాలలో ప్రతిబింబిస్తూ ఉంది. స్వదేశ సంస్థానాల విషయమై హరిపుర కాంగ్రెసు తీర్మానంలోకూడ కనపడుతూ ఉంది. వైస్రాయి గాంధి సంభాషణలు, వైస్రాయి లండను ప్రయాణము, దీనికే తావిస్తూఉంది. ఈ మధ్య బులుభాయి లండనులో ఇట్టి భావాలే అచ్చటి అధికారులకు తెలియజేశాడని తెలుస్తూ ఉంది.

దానికై కాంగ్రెసు అధ్యక్షుడు సుభాష చంద్రబోసు, రాష్ట్రములలో మంత్రి పదవులు అంగీకరించినట్లే ఫెడరేషనునుకూడ అంగీకరిస్తామనుకోవడము ప్రమాదమన్నాడు. కాంగ్రెసులో ఒకవేళ అధిక సంఖ్యాకు లంగీకరించినా తాను రాజీనామా నిచ్చి, ఆనిర్ణయానికి వ్యతిరేకంగా ఆందోళన సాగిస్తానన్నాడు.

ప్రపంచ యుద్ధము వస్తూఉంది. దానిలో చిక్కుకొని ప్రాణ సంకటములో పడే బ్రిటిషు ప్రభుత్వంతో కొంతమంది కాంగ్రెసు నాయకులు, ఫెడరేషను విషయమై రాజీ ప్రయత్నాలు చేయడం, బ్రిటిషు ప్రభుత్వంనుండి స్వాతంత్ర్యాన్ని లాక్కోవడానికి గల చక్కని అవకాశాన్ని పోగొట్టుకోవడమే అవుతుంది. బ్రిటిషు ప్రభుత్వము కాంగ్రెసు నాయకత్వమును చీల్చి ఫెడరలు రాజ్యాంగ విధానాన్ని కొనసాగించ గల్గుతుంది. కాంగ్రెసులోని అతివాదులను అణచడానికి, మితవాదులను ఉపయోగించుకోడానికి తాను మొదటనుండి చేస్తూ ఉన్న ప్రయత్నాలను పూర్తిగావిస్తుంది. అందుకనే సుభాషబోసు ఈదేశానర్థ కరమగు విధానాన్ని ఎదుర్కొంటానని తన స్థిర సంకల్పాన్ని ప్రకటించాడు.

కాంగ్రెసు తీర్మానం ఫెడరేషనును పూర్తిగా భగ్నం గావించి కాన్‌స్టిట్యుయంటు అస్సెంబ్లీచే నిర్ణయింపబడిన రాజ్యాంగ విధానమును ఏర్పాటుచేయడం. తీర్మానం ఇలాఉంటే కొద్ది మార్పులుచేస్తె అంగీకరిస్తామని రాయబారాలు మొదలు పెట్టడము. ఫెడరేషను వచ్చినా కాంగ్రెసు మంత్రులు రాజీనామా నివ్వక, ఫెడరేషనును మరియొకరి చేతుల్లోకి పోనివ్వకుండా కాంగ్రెసువారే అంగీకరించాలని సత్యమూర్తిలాంటి మితవాదులు చెప్పడం, కాంగ్రెసు తీర్మానానికి వ్యతిరేకం. హింసాయుతమైనగాని, అహింసాయుతమైనగాని ఎట్టి పోరాటములేకనే సంపూర్ణ స్వాతంత్ర్యం సంపాదిస్తామని అనుకొనే సత్యమూర్తిగారికి సుభాషబోసు దృఢసంకల్పం రుచించకపోవడం ఆశ్చర్యములేదు. సుభాషబోసు, దేశానికి హానికరమైన రాజీలను సత్యమూర్తిగారిలాంటి వారి చర్యలను ఖండిస్తూ జాగ్రత్త పడవలసిందనీ, వారి ప్రయత్నాలను, భగ్నం కావించాలని హెచ్చరిస్తే కాంగ్రెసులో చీలికలు కల్గిస్తున్నాడనీ, కాంగ్రెసును బలహీన పరుస్తున్నాడనీ సత్యమూర్తిగారు గోలచేయ నారంభించారు. కాంగ్రెసు తీర్మానానికి వ్యతిరేకంగా వెళ్లే సత్యమూర్తి ప్రభృతులా లేక రాజీ ప్రయత్నాలను అరికట్టవలసినదిగా ప్రజలను హెచ్చరించిన సుభాషా? ఎవరు కాంగ్రెసును బలహీనపరిచేది?

ఈ మధ్య కాంగ్రెసు మంత్రుల చర్యలపై కాంగ్రెసు కమిటీల యాజమాన్యం పోయి, కాంగ్రెసు కమిటీలపై మంత్రుల యాజమాన్యం ప్రబలమవుతూ ఉంది. ఇది మారిపోవాలి. మితవాద కాంగ్రెసు నాయకులు కూడ ప్రజా పోరాట సంరంభం ఎక్కువయితే, దానికి వ్యతిరేకంగా పోజాలరు, పోవుటకు సాహసించరు. అందుచే కాంగ్రెసులో చీలికలు గల్గించి బలహీన పర్చడానికి బ్రిటిషు ప్రభుత్వం చేసే ప్రయత్నాలకు మితవాద కాంగ్రెసు నాయకులు సాయపడకుండా చేయడానికి ఈ క్రింది కార్యక్రమం మీద ప్రజా పోరాటాలు బయలుదేర తీయాలి.

1. మిగిలి ఉన్న రాజకీయ ఖైదీలను విముదల చేయాలి. (మన రాజధానిలో ఊటీబ్యాంకు కేసు ఖైదీలు.)

2. కార్మిక హక్కులను నష్టకరమైన చట్టాలను రద్దు చేయాలి. వారి సమ్మె హక్కును పూర్తిగా గుర్తించాలి.

3. రైతుల పక్షము వహించి జమీందారులతో ఎట్టి రాజీ పెట్టుకోక, రైతుల కష్టాలను పోగొట్టాలి. జమీందారీ దౌర్జన్యాలను, అక్రమాలను అరికట్టాలి. (మన రాష్ట్రంలో, కృష్ణా, గోదావరి జిల్లాలలో ఇవి మితిమీరుచున్నాయి.)

4. రైతుల అప్పులను రద్దు చేయాలి. వరపతి కల్గించాలి. రైతుల పన్నులు తగ్గించాలి. రైతులకు ఇర్రిగేషను స్కీములు వెంటనే ఆరంభించాలి. తుంగభద్రా ప్రాజెక్టును వెంటనే పెట్టాలి.

5. పోలీసు ఒత్తిడిని, దౌర్జన్యాలను తొలగించాలి. వారి ఆటలను సాగనివ్వరాదు.

6. లంచగొండి తనాన్ని మాపుమాపు చెయ్యాలి.

7. క్రిమినలు ట్రైబ్సు ఆక్టును, పౌరసత్వ హక్కులకు భంగం కలుగజేసే చట్టాలను రద్దు చేయాలి.

8. ప్రజా సామాన్యమంతా, రైతు కార్మిక సంఘాలన్నీ, ముఖ్యంగా కాంగ్రెసు సంఘాలన్నీ ఈ పోరాటాలను వెంటనే ఆరంభించాలి.

ఇదే సత్యమూర్తిలాంటి వారికి సరియైన జవాబు.

## కాంగ్రెసు ప్రభుత్వములు — కమ్యూనిస్టులు

కమ్యూనిజము అంటే ఒక పెనుభూతమనిన్ని పండిత జవ్హారిలాల్ నెహ్రూ అట్టి ప్రమాదకరమైన భావాలను ప్రచారం చేస్తున్నాడనిన్ని ఆ ప్రచారాన్ని అరికట్టాలనిన్ని లక్నో కాంగ్రెసు అనంతరం బొంబాయి పెట్టుబడిదారులు పలువురు ప్రభుత్వాన్నికోరుతూ ప్రకటనచేశారు. కాన్పూరుసమ్మె సందర్భంలో మిల్లు యజమానుల సంఘంవారు, యు. పి. కాంగ్రెసు ప్రభుత్వాన్నికూడ అట్టి కోరికనే కోరినారు. యు. పి. ప్రధానమంత్రి గోవింద వల్లభపంతుగారు దానికి సమాధాన మిచ్చుచు నుడివిన యీక్రింది అమూల్యవాక్యముల నెల్లరు గమనింపవలెను.

"ఎవరికి యేవిధమైన అపోహ లేకుండునుగాక! కమ్యూనిజమును సిద్ధాంతముగా గాని లేక రాజకీయ కక్షిగాగాని మనమెంత ద్వేషించినను నిర్బంధ విధానమువల్లనే దానిని అణచుట అసంభవమని స్పష్టముగా చెప్పవలసియున్నది. ఇంగ్లండువంటి నాగరిక ప్రభుత్వాలలో దానిపై నెట్టి నిషేధమునులేదు సరికదా అచ్చట కమ్యూనిస్టులు బహిరంగముగా తమ ప్రచారమును సాగించడము. కమ్యూనిస్టు టిక్కెట్టుపై పార్లమెంటు యెన్నికలకు కూడా నిలవడము జరుగుతున్నది". ఇంగ్లండు దేశంలో కమ్యూనిస్టు పార్టీపైలేని నిషేధము హిందూదేశములో నుండుట తప్పని యీ విధంగా పంతుగారు పరోక్షంగా అంగీకరించి నందులకు అభివందనములు. కమ్యూనిస్టు పార్టీ అఖిల భారత పార్టీ యైనను, భారత ప్రభుత్వమే దానిపై నిషేధము తొలగించుటకు ఉత్తరవాది యైనను రాష్ట్ర శాఖలపై రాష్ట్ర ప్రభుత్వాలు ఆంక్షను తొలగించుటకు అధికారము కల్గియున్నవి. వెంటనే కాంగ్రెసు ప్రభుత్వాలున్న యేడు రాష్ట్రాలలోను యీ పని జరుగుటకు అభ్యంతర మేమీ ఉండకూడదు.

పంతుగారు ఇతర విషయాలలో మార్గదర్శకు లయినటులే, కమ్యూనిజము కమ్యూనిస్టు పార్టీలపట్ల తాము వెల్లడించిన వైఖరికి అనుగుణ్యంగా కమ్యూనిస్టు పార్టీపై తమ రాష్ట్రంలో నిషేధాన్ని తొలగించాలి. దానికి మొదటిమెట్టు తమ రాష్ట్రములోనున్న కమ్యూనిస్టు ఖైదీలగు, భట్టాచార్య, రామచంద్ర సిన్హాలను వెంటనే విడుదల చేయుతే.



# జపాన్ బందిపోటులకు ఇండియా సాయము చేయదు

## చైనా దినోత్సవం దేశమంతటా విజయవంతంగా సాగింది

### చైనాలో చిత్రవధలు.

కాంగ్రెసుచే నియమింపబడ్డ చైనా వైద్య సహాయ సంఘకార్యదర్శి హాతే సింగుగారు బొంబాయి నగరంలో రూ 11,150 లు వసూలుచేశారు. అనేక మంది వర్తక ప్రముఖులు దీనికి సహాయం చేశారు. ఇదిగాక, చైనా దినోత్సవ సందర్భంలో సుమారు 12,000 చిన్నచిన్న చైనా జండాలు అమ్మబడ్డాయి. సాయంకాలం బొంబాయిలో జరిగిన బహిరంగ సభలో చైనా ప్రభుత్వ ప్రతినిధి (Vice-consul) అయిన యో-షీన్-షేన్‌గారు ఉపన్యసిస్తూ, యీ విధంగా పలికారు,

"మా దేశస్థులు నేడు నిర్దయతో చిత్రవధ చేయబడుతున్నారు. ఫలవంతమైన మా దేశం ధ్వంసం చేయబడుతోంది. మా విజ్ఞానం, మా నాగరికత నాశనం చేయబడుతున్నాయి. విద్యాలయాలు, పారిశ్రామిక సంస్థలు నేలమట్టం చేయబడుతున్నాయి. చైనాలో నేడు జరుగుతూన్న యుద్ధంలో ఎన్నెన్ని దారుణాలు జరుగుతున్నాయో పైవాటినిబట్టి తెలుసుకోవచ్చు. కాని, ప్రాణం పోయేవరకు మాదేశస్థులు ధైర్యసాహసాలతో పోరాడుతారు"

### ముందు ముందు ఎన్నోకష్టాలు.

హాతీసింగుగారు చైనా దినోత్సవంనాడు భారతీయుల కర్తవ్యాన్ని గురించి యీ విధంగా ప్రకటించారు.

"చైనా ఓడిపోతే ప్రపంచమందలి సామ్రాజ్యవాద శక్తులు బలపడతాయి. అనేక సంవత్సరముల నుంచి స్వాతంత్ర్యం కొరకు ధైర్యంగా పోరాడుతూన్నమనం యీ సామ్రాజ్యవాద శక్తులను బలపరిస్తే ముందుముందు యెన్నో కష్టాల నెదుర్కోవలసి యుంటుంది. కాబట్టి చైనా దేశస్థులు నేడు జరుపుతూన్న పోరాటం మన స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగమే. ఈ విషయాన్ని గ్రహించి, మనం చైనాకు తప్పక సహాయం చేయాలి"

### బందిపోటు దొంగలు

ఇదే విధముగా, కలకత్తాలో కూడ రాష్ట్ర కాంగ్రెసు కమిటీయొక్క యాజమాన్యాన్ని బహిరంగ సభలు, ఊరేగింపులు జరిగాయి. మొదటి రోజున వాలంటీర్లు సుమారు 11,000 చైనా జండాలను అమ్మారు. సాయంకాలం జరిగిన బహిరంగ సభకు యీమధ్య తన ఐ. సి. యస్. ఉద్యోగమునకు రాజీనామా యిచ్చిన హెచ్. వి కామత్‌గారధ్యక్షత వహించారు. ఆయన యీ క్రింది విధంగా ఉపన్యసించారు.

"చైనావారు శాంతిని కోరుతారు. మనంకూడా అంతే. ఇతరుల సంపదను హరించే దురాశ మనకు లేదు. ఇతరుల దేశాలను ఆక్రమించుకుందామనే కోరిక అసలేలేదు. ఇతరులకు నష్టం కలిగించి ధనాన్ని పోగుచేసుకొనే స్వభావం మనకులేదు. కాని, యితరులకది ఉన్నది. దొంగలు, దోపిళ్లుచేస్తేవారు ఉన్నారు. ఈ సామ్రాజ్యవాదు లందరు రాజకీయంగా బందిపోటు దొంగలని చెప్పాలి. కాని, వారి రోజులు దగ్గరకు వచ్చాయి. మన జీవితకాలంలోనే సామ్రాజ్యవాదం కూలిపోవుట చూడగలం"

### చైనా ప్రతినిధి సందేశం.

బెంగాల్ రాష్ట్ర కాంగ్రెసు కమిటీకి కలకత్తాలో ఉండే చైనా ప్రభుత్వ ప్రతినిధి యీ క్రింది సందేశాన్ని పంపాడు;

"చైనా దినోత్సవ సందర్భంలో మీరు చేస్తూన్న కృషికి ధన్యవాదములు. చైనాకు త్వరలో ఒక వైద్య సహాయ సంఘాన్ని పంపుటకు మీరు చేస్తూన్న ప్రయత్నాలనుచూచి ఎంతో సంతసించుచున్నాను. సరియైన సమయానికి చైనాకు మీరు చేస్తూన్న సహాయం మీ దేశానికి, చైనాకుగల స్నేహాన్ని తెలియజేస్తుంది. అంతేకాదు. అంతర్జాతీయ రాజకీయాలలో శాంతిని సుస్థిరం చేయుటకు మీరు దృఢసంకల్పురై ఉన్నారని కూడా తెలియజేస్తుంది. మీ సహాయాన్ని: మీరు చూపుతూన్న స్నేహాన్ని మాదేశం ఎన్నడూ మరచిపోజాలదు"

### ఐక్య సంఘటన.

చైనాలో ప్రజలు చూపుతున్న జాతీయైక్య సంఘటనను భారతీయులు గుర్తించి, మన దేశంలోకూడా వివిధ సామ్రాజ్య వ్యతిరేక శక్తులమధ్య ఐక్యసంఘటనను స్థాపించాలంటూ తీర్మానం ఒకటి సభలో ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

చైనా జాతీయ గీతాన్నిపాడుతూ, చైనా జాతీయ పతాకాన్ని కాంగ్రెసు పతాకముతో కలిపి ఎగురవేస్తూ, అనేకమంది చైనాబాలురు, బాలికలు కలకత్తా నగరవీధులో ఊరేగింపులు చేశారు. కాంగ్రెసు వాలంటీర్లు, ప్రజలు వారితో కలసి ఊరేగింపులో పాల్గొన్నారు.

### మైసూరు.

మైసూరు సంస్థానంలోకూడా చైనా సహాయ సంఘమువారు సుమారు రు 2100 లును, రు 1250 ల విలువగల సామానును చైనాకు పంపారు.

### జపానుకు సహాయం చెయ్యవద్దు.

తమదేశానికి గత సంవత్సరం కంటె ఎక్కువ ప్రత్తిని యెగుమతి చేయాలంటూ యీమధ్య జపాన్ రాయబారి ఒకడు బొంబాయి వచ్చాడు. ఆపత్తి ఖరీదును యెప్పుడో, దీర్ఘవాయిదాలమీద, చెల్లిస్తారట. దీనికి మనూ సుబేదార్, యం. ఎల్. ఏ. గారు సమాధానమిస్తూ యిప్పటికే జపాను షావుకార్లు భారతదేశానికి చాలాసొమ్ము బాకీ ఉన్నారన్నియు, అంతేగాక, త్వరలో జపాన్ ఆర్థికంగా మంచిస్థితికి రాగలదనే ఆశ లేదనియు, కనుక యిప్పుడు జపాన్‌వారికి సహాయంచేయుట మంచిదికాదనియు ప్రకటించారు.

భారతీయ వర్తకులందరూ యీ సమయంలో జపాన్‌కు సహాయం చెయ్యకుండా ఉంటే, చైనాకు మనం కావలసినంత సహాయం చేసినట్లే అవుతుంది. మనూ సుబేదార్‌గారిచ్చిన సలహాను వారు తీసుకొంటారని నమ్ముతున్నాము.



" ఒక అంగుళం భూమి మిగిలినా ఒక చైనా దేశస్థుడు మిగిలినా, చివరిదాకా యుద్ధం చేస్తాం" అని ప్రతిజ్ఞ పట్టిన జంగ్ - కే- షెక్

### చైనా నిధికి ఏలూరులో 72 రూపాయలు

అఖిలభారత కాంగ్రెసు సభాధ్యక్షులు సుభాష్ చంద్రబోసు ఆజ్ఞానుసారం యీ పట్టణమున 8, 9 తేదీలలో చైనా దినోత్సవం జరుపబడెను. 8 వ తేదీ సాయంత్రం 3 గంటలకు ఏలూరు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, పట్టణ కార్మికసంఘముల యాజమాన్యమున రెండు ముఠాలుగా డబ్బాలు తీసుకొని జపాను చైనా యుద్ధమును గురించి, చైనాకు మనం చేయు సహాయపు ఆవశ్యకతను గురించి ప్రజలలో ప్రబోధము చేయుచూ సొమ్ము వసూలుచేసిరి. బజారులందు చైనా యుద్ధమును గురించి, చైనాకు సహాయమును చేయుటను గురించి స్లోగన్సు యిచ్చుకుంటూ 9 వ తేదీ సాయంత్రం 7 గంటలకు పురమందిరమునకు చేరిరి. అచ్చట పై రెండు సంఘముల యాజమాన్యమున కామ్రేడ్ నరాలశెట్టి జార్జిగారి అధ్యక్షతను బహిరంగ సభ జరుపబడెను. సభలో చైనా — జపాను యుద్ధమును గురించీ, జపానువారి దౌష్ట్యాలను, నిరంకుశ చర్యలను చైనాలోని కమ్యూనిస్టు — క్యూమింటాంగ్ పక్షములు ఏకమై వివిధ పక్షములవారిని కలుపుకొని సంయుక్త సంఘటనద్వారా ఏ విధముగా అరికట్టుచున్నదీ విపులముగా చెప్పబడెను. సభలో చైనా కూలీల మేస్త్రి "ఖాహూన్" చైనా ప్రజలపట్ల భారతీయులు చూపుచున్న సానుభూతిని కొనియాడుచూ అభివందనములు తెల్పుతూ ఇంగ్లీషులో మాట్లాడెను. రెండు రోజులనుండి వసూలుచేసిన ధనముగల డబ్బాలను పగులగొట్టి లెక్కింపబడెను. మొత్తం రు 72-2-0 లు వసూలుకాబడెను. యిందు చైనా కూలీలు ప్రత్యేకించి రు 5-0-0 లు యిచ్చిరి. పిమ్మట చైనాపై యుద్ధమును ప్రకటించకుండగనే అకస్మాత్తుగా జపాను మిలటరీ ఫాసిస్టులు సలుపుచున్న రాక్షస కృత్యములను ఖండించుచూ, జపానును చైనా కమ్యూనిస్టు—క్యూమింగ్‌టాంగ్ పక్షములవారు సంయుక్త సంఘటన ద్వారా ఎదుర్కొనుటలో పై రెండు పక్షములవారిని అభినందించుచూ చైనా స్వాతంత్ర విజయమును, తద్వారా ప్రపంచ శాంతిని కోరుచూ తీర్మానించబడెను. పిమ్మట సభ ముగిసెను.

★

ఇంకను భారతదేశమందు అనేక స్థలములలో "చైనా దినోత్సవం" జరుపబడింది.

# కాన్పూరు కార్మికులకు విజయహారము

## చైతన్యమందిన కార్మికులు దేశమంతటా విజృంభించుతున్నారు

### రైల్వే కార్మికులు

బందరు

రైల్వే కార్మికులకు సెలవులు దొరకటం చాలా కష్టంగా వుంది. రైల్వే డ్యూటీ కాకుండా అధికారుల యింటిపట్టి కూడా పనిచేయాలి. ఆవిధంగా పని చేయనియెడల మరునాడు T 20 యిస్తారు.

లోకోషెడ్డు వాచ్‌మెన్ నాలుగు సంవత్సరములనుండి ఏకరీగా రాత్రి డ్యూటీ చేయుచున్నారు. రైల్వే యధికారులు కార్మికుల కష్టాలను ఆలోచించి తగినచర్య తీసుకోవాలి.

గుడివాడ, భీమవరం, స్టేషనుల నుండి కొంతమంది గ్యాంగుమాన్లను, నూజివీడు శెక్షనుకు మార్చియున్నారు. క్రొత్తచోట నివసించు అనేక బాధ్యతలకు పాత్రులై వైద్యసహాయము లేక చాలా బాధపడుచున్నారు. అధికార్లు వీరిని త్వరలో ఎక్కడివారిని అక్కడకు పంపివేయాలి.

బెజవాడ

ఎక్కువ సంవత్సరములు సర్వీసు వున్న కోలు కాలీలను కొందరిని క్వార్టేటి క్లీనర్లుగా మార్చి మరల యిప్పుడు కోలు కాలీలుగా మార్చి, వారిస్థానే క్రొత్తవారికి ఉద్యోగములు యిచ్చారు. ఈవిధంగా ఎక్కువ సర్వీసువున్న వారికి తగిన ప్రమోషన్లు యివ్వకపోతే కార్మికులలో అసంతృప్తి ఎక్కువగుచున్నది.

రైల్వే కార్మికులు కాబూలీల బాకీలతో అనేక బాధలను పొందుచున్నారు. వారి జీతములో కాబూలీలకు వడ్డీగా యిచ్చేది పోతే మిగిలేది చాలా తక్కువ. రైల్వే కార్మికులకు జీతాలు ఇచ్చేసమయంలో కాబూలీలు కాచుకొని వుంటే, అధికార్లువచ్చి వారిని తరిమివేసారు. కాంగ్రెసు మంత్రులు కార్మికుల ఋణపరిష్కారము కొరకై వెంటనే ప్రయత్నం చేయాలి.

### బట్టల మిల్లు కార్మికులు.

మదరాసు

చూళై మిల్లులోని 2000 మంది కార్మికుల సమ్మె 20 రోజులనుండి సాగుతోంది. మిల్లు గేటువద్ద పికెటింగు జరుగుతోంది. కార్మిక సంఘము యొక్క యాజమాన్యాన్ని ఊరేగింపులు, బహిరంగ సభలు జరుగుతున్నాయి.

కోయంబత్తూరు.

ఇక్కడ కార్మికులకు యజమానులకు మధ్య జరిగిన తగాదాల ఫలితంగా కాంగ్రెసు మంత్రి వర్గంవారొక విచారణ సంఘాన్ని నియమించారు. ఆ సంఘం పరిస్థితులను గురించి పూర్తిగా విచారణ సలిపి, ఒక నివేదికను ప్రచురించింది. దాని ప్రకారం కార్మికులకు ఒక స్కేల్ ప్రకారం జీతం హెచ్చించాలి. కాని, యీ సిఫార్సులు అమలులో పెట్టించుటకు మదరాసు ప్రభుత్వం పూనుకోవటంలేదు. త్వరలో అమలులో పెట్టునట్లు చేయాలని కార్మికులు సభలు, తీర్మానాలు చేస్తున్నారు. విచారణ సంఘ సిఫార్సులను గురించి అభిప్రాయం తెలుపవలసినదిగా ప్రభుత్వం యజమానులకు సర్క్యులర్లు పంపింది. యీ విధంగా ఆలస్యము చేయుట అనవసరం.

తప్పని అనుభవజ్ఞులను విచారణ సంఘముగా నియమించిన ప్రభుత్వము వెంటనే వారి శిఫార్సులను అమలు జరుపుట విధిగ ధర్మం. కార్మిక ప్రతినిధులకు యిట్టి సర్క్యులర్లు పంపక పోయినప్పటికీ, బహిరంగ సభలో తమ అంగీకారాన్ని తెలియజేసి కాంగ్రెసు మంత్రుల యెడ తమకు గల విశ్వాసాన్ని ప్రకటించారు.

విచారణ సంఘపు సిఫార్సులను గమనించి ఆలోచించుటకు వచ్చిన స్పెషల్ ఐ. సి. యస్. ఎదుట వాసుదేవ్, వి. రామమూర్తి మొదలైన కార్మిక నాయకులు సాక్ష్య మిచ్చుచున్నారు. ఈ లోపుగా, 7-8 తేదీలలో 3 మిల్లులలో హఠాత్తుగా మరల కార్మికులు సమ్మె చేశారు. కాని, వెంటనే తిరిగి పనిలో చేరారు.

> ### తూ. గో. జిల్లా ఆర్థిక రాజకీయ పాఠశాల
> ### రాజమండ్రి.
>
> ఈనెల 15 వ తేదీనుండి పాఠశాల ప్రారంభించి నెల రోజులు సాగించుటకు ముమ్మరంగా ఏర్పాట్లు జరుగుచున్నవి. రాజమండ్రి వాస్తవ్యులు శ్రీకాకి ప్రభాకర్‌రావు గారు దానవాయి పేటలోని "అమరావతి" అను తమ విశాలమగు భవనమును విద్యార్థుల వసతికై ఉచితముగ నిచ్చుట కంగీకరించిరి, శ్రీ సోమన కామేశ్వరరావు గారు వంటలు, భోజనం వగైరాల కుపయోగించు కొనుటకు ప్రక్కనే వున్న తమ గృహము నొసంగిరి. పాఠశాల తరగతులు నడుపుకొనుటకును, పఠనాలయము పెట్టుకొనుటకును దానవాయిపేట ఉచిత పఠనా మందిరమును దాని అధ్యక్షులైన శ్రీవెన్నేటి సత్యనారాయణ గారు యిచ్చుట కంగీకరించిరి. వివిధ ప్రాంతాలనుండి యువకులు పాఠశాలకు దరఖాస్తులు పంపుచున్నారు, ఉత్సాహవంతులగు యువకులు ఆలసించక వెంటనే దరఖాస్తులు పంపాలి, దరఖాస్తులు పంపిన విద్యార్థులు 15 తేది ఉదయానికే పాఠశాల భవనము వద్దకు హాజరు కావలెను.

కాన్పూరు

50 రోజులు సమ్మె జరిగి, మొన్ననే ముగిసింది. 50 లేక 60 వేలమంది కార్మికులు సమ్మెలో చేరి పనిచేశారు. అనేకమంది పికెటింగు చేసినందుకు అరెస్టు చేయబడ్డారు. యజమానులకు 1½ కోట్ల రూపాయలు నష్టం వచ్చింది. కార్మికులు 20 లక్షల దినాలు పోగొట్టుకున్నారు. యజమానులు, కార్మికులు రాజీ షరతుల నంగీకరించి పనిచేయుటకు ప్రారంభించారు.

సంధి షరతులు

(i) మొట్టమొదట రాజేంద్ర ప్రసాద్ విచారణ కమిటీ వారి శిఫార్సుల ప్రకారం కార్మికులకు స్కేలు ప్రకారం జీతాలు హెచ్చింపబడ్డాయి. కనీసపు వేతనం రు. 15 లని నిర్ణయం చేయబడకపోయినా, ఒడంబడిక ప్రకారం యెవరికీ రు. 15 లకు తక్కువ ఈయబడదు.

(ii) ఇక ముందు కార్మికులకు యజమానులకు జీతముల విషయమై తగాదా వస్తే, వేతనముల నిర్ణయ సంఘం (wage-fixation board) నిర్ణయించును. దీనిలో సగం కార్మికుల ప్రతినిధులు, సగం యజమానుల ప్రతినిధులు ఉందురు. ఇరు పక్షాలకు యిష్టమైన వ్యక్తి అధ్యక్షత వహిస్తాడు.

(iii) ఇక ముందు యజమానులకు క్రొత్త కార్మికులు అవసరమైతే లేబరు ఎక్స్ఛేంజి (labour exchange) అను సంస్థ స్థాపించి చేయాలి.

(iv) లేబర్ కమిషనర్ అంగీకరించిన నవ్వుడే కార్మికులను డిస్మిసు చెయ్యాలి.

(v) కాన్పూరు కార్మిక సంఘంయొక్క ఫాల్సు మార్పు చేయాలి. అనగా, కార్మికులలో శిక్షణ మొదలైన లక్షణములు పెంపొందించుటకు, అనవసరంగా సమ్మెలుచేసి ఇరుపక్షాలకు నష్టం వాటిల్లునట్లు చేయుటకు వీలులేకుండా సంఘముయొక్క నియమావళిలో మార్పుచేయవలెను. ఈ మార్పులు లేబర్ కమీషనర్‌కు అంగీకారమైతే, అప్పుడే యజమానులు కార్మిక సంఘాన్ని గుర్తిస్తారు.

ఈ ఆఖరి షరతును గురించి త్వరలో రాజీ కుదరలేదు. తమ సంఘాన్ని వెంటనే గుర్తించాలను షరతు యజమాను లంగీకరించక పోయినా, కార్మిక నాయకులు రాజీకి సమ్మతించారు.

రాజీ యేర్పడింది. సంప్రతింపులు ఫలించాయి, మిల్లులు యథాప్రకారంగా తెరువబడ్డాయి, కార్మికులు సంతోషంతో పనిచేస్తున్నారు, అరెస్టుచేసిన పికెటర్లను విడుదలచేశారు. కాని యజమానులు సమ్మె ప్రారంభం నుండి కాంగ్రెసు మంత్రులను యిబ్బందులు పెట్టుట మానలేదు. కార్మికోద్యమములో కమ్యూనిస్టు లున్నారట! వారు దేశశాంతిని భంగపరుస్తున్నారట! వినాశకరమగు పనులు చేస్తున్నారట! వారిని కాంగ్రెసు మంత్రులు శిక్షించకపోతే కార్మికోద్యమానికి నష్టం వస్తుందట! దీనికి మంత్రులు చక్కగా సమాధానమిచ్చారు. యజమానులు మళ్ళా తలయెత్తకోకుండా చేశారు.

"కమ్యూనిజం ఒక రాజకీయ సిద్ధాంతం. ... నిర్బంధ విధానమువల్ల అణచివేయబడదు. ఇంగ్లండు వంటి నాగరికత దేశాలలో అది నిషేధించబడలేదు. అక్కడ కమ్యూనిస్టులు బహిరంగంగా ప్రచారం చేసుకొంటున్నారు. కమ్యూనిస్టు ట్రికెట్టుమీద శాసనసభలకు పోటీచేస్తున్నారు." అని కాంగ్రెసు ప్రభుత్వం సమాధానం వ్రాసింది.

కాన్పూరు సమ్మె భారత కార్మికోద్యమ చరిత్రలో ఒక ప్రధాన స్థానము నాక్రమించుచున్నది. దీనివల్ల మనం అనేక గుణపాఠములు నేర్చుకొనవచ్చును.

(1) కార్మికుల హక్కులను కార్మికులే, పోరాటంద్వారా కాపాడుకోవాలి. కార్మికులకును యజమానులకు మధ్య కలహమున్నప్పుడు, ఏవర్గము యెక్కువ బలము, త్యాగము, తెలివి తేటలు కనుపరచునో ఆవర్గమునకు విజయము తప్పదను సిద్ధాంతం కాన్పూరులో రుజువైనది. వర్గకలహ సిద్ధాంతం అసలు మన దేశంలో లేనేలేదని చెప్పువారివాదన అర్థరహితమైనదని స్పష్టపడినది.

(2) రాజీ షరతులలో కార్మికులకు కావలసిన ప్రధాన కోరికలు ఒకటి రెండు అంగీకరించబడక పోయినప్పటికి, 50 రోజుల సమ్మెలో కార్మికులు తమ పోరాటంలో అవలంబించవలసిన పద్ధతులను గురించి చక్కని తరిఫీదు పొందగలిగారు. బహిరంగ సభలు, పికెటింగులు, సంప్రతింపులు మొదలైనవాటిని ఏయే దశలలో ఎట్లు నడిపించవలెనో నేర్చుకొన్నారు. పెట్టుబడిదారీ విధానం ఉన్నంతకాలం కార్మికుల కోరికలు యీడేరవు. కాని వాటికైచేయు పోరాటాలలో కార్మికులు అనేక పాఠాలు నేర్చుకుంటారు. అనేక అనుభవాలు సంపాదిస్తారు. ఇట్టి చిన్న పోరాటాలే విప్లవాలకు తోడ్పడతాయి.

(3) కాన్పూరు సమ్మెలో, వివిధ రాజకీయ సిద్ధాంతములుగల కార్మికనాయకులు, కార్మిక ప్రతినిధులు తాత్కాలికంగా తమ విభేదాలను మరచి, కార్మికుల సమస్య వచ్చినప్పుడు ఏవిధంగా ఐక్యతచెందాలో చూపారు. కాన్పూరులోఉన్న కమ్యూనిస్టులు, కాంగ్రెసు సోషలిస్టులు, ట్రేడ్ యూనియన్ నాయకులు ఒకే వేదికపై నిలబడి సమ్మెను జయప్రదంగా నడిపారు. వారు కార్మికులనుండి దూరముకాక, వారి కోరికలను సరియైన మార్గంలో ప్రదర్శిస్తూ, వారి ఉద్యమానికి నాయకత్వం వహించారు.

(4) కమ్యూనిస్టులు, కాంగ్రెసు సోషలిస్టులు నేడు కోరుతూన్న జాతీయైక్య సంఘటన యెట్టిదో కాన్పూరు సమ్మె చూపింది. నేడు మన పోరాటం బ్రిటిషు సామ్రాజ్యవాదులపై. కాంగ్రెసు సంస్థ ఎన్నో సంవత్సరముల నుంచి ఈ పోరాటాన్ని నడుపుతోంది. కాని, ప్రజాసామాన్యంతో దానికి సన్నిహిత సంబంధం లేకపోవటం వల్ల యీ పోరాటం జయప్రదం కావటంలేదు. అందుకు కావలసిన దేమంటే, కార్మికులు. కర్షకులు తమ సామాన్య హక్కులకై చేయు పోరాటాన్ని, కాంగ్రెసు రాజకీయ పోరాటంగా మార్చాలి. కాన్పూరు కార్మికులు కోరిన కోరికలు సోషలిస్టుల కోరికలు కావు. అత్యవసరమైన జీవితావసరముల కొరకు వారు సమ్మె చేశారు. తమ సంఘాన్ని యజమానులు గుర్తించాలన్నారు. ఇంతే వారు కోరింది. ఈ కోరికలు ఎంతో న్యాయమైనవి. వీటి కొరకు

(మిగతా 15 వ పేజీలో)



# నేటి ప్రపంచం

## చీనా యుద్ధం

జపాను చైనామీద దండెత్తి సంవత్సరం దాటి పోయింది. అయితే జపాను ఈ 12 నెలలూ హోరాహోరిగపోరాడి సంపాదించుకొన్న దేమిటి? అమాయ్, షాంఘై, నాంకింగు, ట్సింగ్‌టోవో, చెఫూ, టీన్సిన్, పీపింగు అను పట్టణాలను ఆక్రమించుకుంది. 3500 మైళ్ళ రైలుమార్గాన్ని ఆక్రమించుకొంది. 1300 మైళ్ల సముద్రతీరాన్ని కూడ ఆక్రమించుకుంది. యాంగిట్సీ యాంగ్, ఎల్లో నదులలో నౌకలు పోవడానికి వీలైనంతవరకు ఆక్రమించుకుంది. చైనాలోని 18 రాష్ట్రాలలో 4 రాష్ట్రాలను పూర్తిగను మరియొక 4 రాష్ట్రాలలో కొంతవరకును తన అధికారాన్ని నెలకొల్పింది. కాని ఈ అధికారం కేవలము నామమాత్రమే. రైలు మార్గము, నదీమార్గముల కిరువైపుల 20 మైళ్లకన్న అధికారము చెలాయించలేకున్నారు. ప్రజలంతా తిరుగబడి యుద్ధము చేస్తుంటే అంతకన్న చేసేదేమీలేదు. చైనాకు ఇంకా 12 ముఖ్యపట్టణాలున్నాయి. జపాను స్వాధీనంలోఉన్న ప్రదేశానికన్న మూడురెట్లు ప్రదేశమున్నది. 2400 మైళ్ల రైలు మార్గముంది. 1500 మైళ్ల సముద్రతీరముంది.

చైనాను పూర్తిగ తలయెత్తకుండా ఇంతవరకు జపాను ఏ యుద్ధంలోనూ ఓడించలేక పోయింది. యాంగిట్సీ నదిమీదుగ ఆంకింగునుండి బయలుదేరిన జపాను యుద్ధనావలు నేటికి కూకియాంగ్ పట్టణానికి వచ్చాయి. దానిని బాంబులతో నాశనం గావించ మొదలుపెట్టాయి. అయినా చైనా విమానాలు జపాను నావలను కొన్నింటిని ముంచివేస్తున్నవి. జపాను విమానాశ్రయములపై దాడివెడలి జపాను విమానములను నాశనం చేస్తున్నాయి. హాంకోను ఆక్రమించుకోడానికి మరియొక రెండు నెలలైనా పట్టుతుందనీ జపానువారే అంటున్నారు.

జపాను సైనికులు 1,00,000 మంది చనిపోయారు. 4,00,000 మంది గాయపడ్డారు. జపానులో ప్రతి కుటుంబము ఇప్పటికే యుద్ధంవల్ల ఒక్కొకరిని బలి ఇచ్చింది. జపాను ఆస్పత్రులన్నీ గాయపడ్డవారిచే నిండిపోయాయి.

చైనాకు ఇంతకన్న ఎక్కువ నష్టము కలిగిందనుట నిజమే. జపానువారి అంచనాల ప్రకారము యుద్ధంలో చనిపోయిన చీనా సైనికులే 5,10,109 మంది. తిండిలేక చనిపోయినవారు; జపాను విమాన దాడులకు గురియై చనిపోయిన స్త్రీలు, బిడ్డలు, యుద్ధములో పాల్గొనని పురుషులు; వరదలలో చనిపోయినవారు; జపానువారు గ్రామాలను కాల్చివేస్తే చనిపోయినవారు లెక్కేలేదు

చీనా తన స్వాతంత్ర్యాన్ని రక్షించుకోడానికి ఇంకా త్యాగం చేస్తుంది. చేయక తప్పదు కూడ. ఈ యుద్ధ ఫలితంగా చైనాలో ఇదివరకెపుడూ లేనటువంటి ఐక్యత ఏర్పడింది, కమ్యూనిస్టులు, కుమింగుటాంగు పార్టీ వారు, ఈ వరకు ఒకరితో ఒకరు యుద్ధం చేసుకొనే వారు, నేడు జపానును ఎదుర్కొనడానికి యేకమయ్యారు. 5 కోట్ల చైనా మహమ్మదీయులు కూడ చైనాను రక్షించుకోడానికి చెయింగ్ కై షేక్‌తో కలసి పనిచేయడానికి తయారయ్యారు. విద్యార్థులు యుద్ధంలో పాల్గొంటున్నారు. టిబెటు, బర్మా సరిహద్దులలో నున్న అనాగరిక తెగలు కూడ చైనాకు తోడ్పడుతూ ఉన్నవి.

ప్రపంచమందంతటా గత 7వ తారీఖున చైనా జపాను యుద్ధ ప్రథమ వార్షిక దినాన మరణించిన వారిని స్మరించారు. షాంఘైలో అనేక బాంబులు వేయబడ్డాయి జపాను సైనికులమీద. ప్రపంచమంతా చైనాకు సానుభూతి చూపుతూ ఉంది, భారతదేశంలో కూడ చైనాకు సాయము చేయడానికి 7, 8, 9 తారీఖులు చైనా దినాలుగ పరిగణించ బడ్డాయి.

జపాను నేడు చైనాకు 10 లక్షల సైన్యాన్ని పంపించియుంది. రష్యా తనపై ఎప్పుడు దండెత్తుతుందో అని మంచూరియా సరిహద్దులలో మరొక మూడు లక్షల సైన్యాన్ని పెట్టియుంది.

## జర్మనీలో అశాంతి

రష్యాకు వ్యతిరేకంగా జపానుతో ఒడంబడిక చేసుకొన్న జర్మనీలో కూడ పరిస్థితులు బాగాలేవు. ఆస్ట్రియాలో నాజీ పార్టీలోనే అసంతృప్తి ఎక్కువగు తూవుంది. ఆస్ట్రియా ఆహార పదార్థాలు, పరిశ్రమలు, బంగారం, జర్మనీకి పంపబడ్డాయి. ఆస్ట్రియాపై అధికారం చెలాయించడానికి జర్మనీ ఆఫీసర్లను హిట్లరు పంపుతున్నాడు. దీనితో ఆస్ట్రియాలో అసంతృప్తి ఎక్కువయితే యూదుల నందరిని పనిలోనుండి తీసివేసి, ఆస్ట్రియనులకు పనిని కల్పించి సంతృప్తి పరచజూస్తున్నాడు.

కాని ఈలోపలనే జర్మనీ గ్రామాలలో తిండి దొరకక, పని దొరకక బాధపడుతూ ఉండే ప్రజలు జర్మనీ నగరాలకు వెళ్ళ నారంభించారు. వీరికి ఎట్టి అవకాశాన్ని చూపించకపోతే విప్లవం వస్తుందని హిట్లరు బాగా ఎరుగును. అందుచే గ్రామంలోనే ఉండి పెండ్లి చేసుకుంటే, వారికి ప్రత్యేకమయిన అలవెన్సు ఇస్తామని ప్రకటించాడు. పట్టణాల్లోకి వెళ్ళవద్దని ప్రచారం సాగిస్తూ ఉన్నారు.

ఆస్ట్రియాలోని మత గురువులు, పెండ్లిండ్లు చేయకూడదనీ, చేస్తే 5 సం॥లు శిక్ష వేస్తామని కూడ ప్రకటించారు. ఆస్ట్రియాలో ప్రతి పెండ్లి గవర్నమెంటు రిజిస్ట్రారు యెదుట జరగాలి.

జెకోస్లోవేకియా పై ఎంత ఒత్తిడి జర్మనీ తెచ్చినా, జర్మనీకి లొంగిపొమ్మని బ్రిటిషు ప్రభుత్వం ఎంత చెప్పినా జెక్ ప్రభుత్వం, లక్ష్యం చేయలేదు. తన దేశములోని అల్ప సంఖ్యాకులకు తాను ఈ వరకు కల్పించుకొన దలచిన సౌకర్యాలనే బిల్లు రూపంలో పెట్టబోతూ ఉంది.

జెకోస్లోవేకియాపై జర్మనీ దాడివెడల డానికి ముందు స్పెయిను ప్రభుత్వపు పనిపూర్తి కావాలి. ఫ్రాంసులోని పాపులర్ ఫ్రంటు విచ్ఛిన్నం కావాలి సోవియట్ రష్యా ఫ్రెంచి దేశాల మధ్యనున్న ఒడంబడిక, అట్లే సోవియట్ జెకోస్లోవేకియా ఒడంబడిక భగ్నం కావాలి. ఈ పనుల కన్నింటికి జర్మనీకి బ్రిటను తన సర్వశక్తులను వినియోగించి సాయము చేస్తూ ఉంది.

## స్పెయినుకు మోసము

స్పెయిను తటస్థ సంఘము, స్పెయిన్నుండి వాలంటీర్లను పంపించి వేయడానికీ, స్పెయినుకు ఆయుధాలు, ఇతర దేశస్థులు వచ్చి సాయపడకుండా సరిహద్దులు కాపాలా కాయడానికి బ్రిటిషు ప్రభుత్వం సూచించిన ప్లానును అంగీకరించింది. సోవియటు ప్రభుత్వం, స్పెయిను సముద్ర తీరములు కూడ అంతర్జాతీయ పరిశీలన క్రిందికి వచ్చేటట్లు సూచించింది.

ఈ ఒడంబడిక మూలంగా ఫ్రాంసు నుండి స్పెయిన్నుకు ఆయుధములు ఈవరకు వచ్చేవికూడ రాకుండపోతాయి. తిరుగుబాటు దారులకు మామూలుగానే వస్తూఉంటాయి.

ఫ్రాంకో అప్పుడే వాలెన్షియాకు 20 మైళ్లలో ఉన్న సాగుంటోవరకు వచ్చారు. ప్రభుత్వ సైనికులు తీవ్రంగా ఎదుర్కుంటున్నాయి. పోరాడుతున్నాయి, అయితే ఆయుధాలు లేకపోబట్టి మెల్లమెల్లగా వెనక్కిపోవలసి వస్తూఉంది.

## రష్యాపై యుద్ధ సన్నాహాలు

జర్మనీ ఈమధ్య బెర్లిననుండి కాబూలువరకు, విమాన ప్రయాణ మార్గాలను ఏర్పాటుచేసింది. దీని మూలమున నష్టమువచ్చినా దానిని సాగిస్తూనే ఉంది. పర్షియా దేశములో (ఇరానులో) టెహరన్ వద్ద విమానాశ్రయము పెద్దది ఒకటి నిర్మిస్తూఉంది. సోవియటు నూనె పరిశ్రమయున్న "బకు"కు సమీపంలో ఉన్న "మెష్హెద్" లో తన యుద్ధ విమానాశ్రయం నెలకొల్పింది. ఇరానుయొక్క ఉక్కు యుద్ధ పరిశ్రమలలో పూర్తి ప్రాబల్యం సంపాదించింది. మొన్న మొన్నటివరకు బ్రిటిషు ప్రభుత్వపు పలుకుబడి క్రింద ఉన్న పర్షియా నేడు జర్మనీకి ఈ సౌకర్యాలన్నీ కల్గించిందంటే, బ్రిటిషు అనుమతి, ప్రోద్బలము లేకుండా చేసిందనుకోవడం అసంభవం, రష్యాపై దాడి వెడలడానికి సంసిద్ధమగుతూఉన్న జర్మనీకి అన్నివిధాల వెన్నకనుండి సాయంచేయుట బ్రిటిషు ప్రభుత్వపు నీతి, అందుచే యుద్ధానికి ఆవశ్యకమగు నూనె పరిశ్రమను నాశనంగావిస్తే రష్యాను పూర్తిగా బలహీనపర్చడానికి సాధ్యమవుతుందని జర్మనీ బ్రిటన్ల ఎత్తుగడ.

అయినా జర్మనీని నమ్మలేక జర్మనీ పలుకుబడిలోకి పోకుండ జేయడానికి బాల్కను రాజ్యాలతో (రుమేనియా, బల్గేరియా, యుగోస్లేవియాలతో) వర్తకపు టొడంబటికలను ఇంగ్లండు చేసుకుంటూ ఉంది. వారికి కావలసిన అప్పునంతా ఇస్తూఉంది. వారివద్ద నుండి వారి వ్యాపారవృద్ధికై సరుకులు కూడ కొంటూ ఉంది.

టర్కీకి సైనిక సన్నాహంకోసం 8 కోట్ల రూ. లకు పైగా అప్పుఇచ్చింది. అవసరమయితే రష్యాకు వ్యతిరేకంగా ఉపయోగించుకోవచ్చు. లేక జర్మనీకి వ్యతిరేకంగానైనా ఉపయోగించుకోవచ్చునన్న బ్రిటిషు ప్రభుత్వపుటాశ.

ఈ విధంగా యుద్ధప్రయత్నాలు సాగిస్తూఉన్న బ్రిటను తనకు యుద్ధానికి చాల అవసర స్థానమయిన పాలెస్టైనుకు స్వాతంత్ర్యం ఇవ్వడానికి తయారవుతుందా? కాని స్వాతంత్ర్య ప్రియులగు అరబ్బులు మాత్రమూరుకుంటారా? బ్రిటిషు ప్రభుత్వంతో వారు గోరిల్లాయుద్ధము చేస్తూనే ఉన్నారు. అరబ్బులపైకి యూదులను, యూదులపైకి అరబ్బులను బ్రిటిషు ప్రభుత్వం ఎక్కతోలుతూ ఉంది. రోజూ బాంబులు తుపాకులు ప్రేలుతున్నాయి, 6వ తారీఖున జెరుసేలంలో బాంబు ప్రేలి 20 మంది చనిపోయారు. మరుసటి రోజు హైఫాలో అరబ్బులపై బాంబును యూదులు వేశారు. చాలమంది చనిపోయారు. గాయపడ్డారు. పాలెస్టైను నంతా యుద్ధ క్షేత్రంగా మారిపోయి ఉంది. బ్రిటిషు సైనికుల మీద, పోలీసుల మీద అరబ్బులు బాంబులు వేస్తున్నారు. బ్రిటిషు ప్రభుత్వం ఇంకనూ ఎక్కువ సైన్యాన్ని యుద్ధ నావలను పాలెస్టైనుకు పంపుతూ ఉంది.

# ఆంధ్ర వైద్య పట్టభద్రులకు అన్యాయం

## పది సం॥ల నుంచి ప్రభుత్వము వారి ఉపేక్ష

శ్రీ యర్రమిల్లి నరసింహారావు

విద్యార్థులకు మదరాసు విశ్వవిద్యాలయము నందు రికగ్నైజుడ్ డిగ్రీలివ్వబడునను ప్రకటనతో 1923 సం॥న విశాఖపట్నం మెడికల్ కాలేజి స్థాపింపబడెను. (1923 మే గెజెట్) తరువాత 1926 సం॥న ఆంధ్ర విశ్వవిద్యాలయము స్థాపింప బడుటచే కాలేజీ యందు చేర్చబడెను.

1934 సం॥న ఇండియన్ మెడికల్ కవున్సిలువారు విశాఖపట్నం మెడికల్ కాలేజి మొదటిసారి పరీక్షించి సరియగు భవన నిర్మాణ సౌకర్యములు లేకుండుటచేతను, రసాయనశాలలు సరిగా లేకుండుట వలనను, డిగ్రీలు రికగ్నైజ్ చేయ నిరాకరించిరి. అప్పుడు మదరాసు ప్రభుత్వమువారీ సమస్యను తీవ్రముగ నాలోచించి కావలసిన సహాయము 16 లక్షల వరకు చేయ తీర్మానించిరి. అందుమూ ప్రభుత్వం తన వాగ్దానాన్ని తప్పక నెరవేరుస్తుందని ఆశపడ్డారు, గవర్నరుగారు కూడా ప్రభుత్వం కొద్ది రోజులలో తప్పకుండా కాలేజీ యభివృద్ధికి గడంగుతుందని చెప్పారు. ప్రభుత్వ వాగ్దానాల వల్లా, గవర్నరుగారి కన్నీటి తుడుపు మాటల వల్లా విద్యార్థిలోకం, ఆంధ్ర ప్రజలు కడుపు నింపుకున్నారు. మూడు దీర్ఘవత్సరాలు సునాయాసంగా గడిచిపోయాయి. ప్రభుత్వం తన వాగ్దానాన్ని పూర్తిగా మరిచిపోయింది. తిరిగి మళ్ళీ 1937, జనవరి నెలయందు, మునుపటి లోట్లు తీర్చకపోవడమే కారణంగా, ఇండియన్ మెడికల్ కవున్సిలువారు, డిగ్రీలు రికగ్నైజ్ చేయ నిరాకరించిరి. ఇంతలో 1937 జూలై వచ్చింది. కాంగ్రెసు 7 రాష్ట్రాలలోను కళ్ళాలు చేతబట్టింది. ఆశాలతలు మొలకలెత్తాయి విద్యార్థి హృదయాలలో. అందుచే 1937 జూలై 6 వ తేదీని మదరాసు ప్రభుత్వంవారికి తమ కోర్కెలను మెమోరాండం రూపంగా తెల్పుకొన్నారు. జూలై 14 ని ప్రభుత్వంవారు చేసిన ప్రకటన ఉత్సాహజనకముగా లేకుండెను. అది కాలేజీ స్థిరత్వమునుగూర్చి మాత్రమే తెల్పెను. కాలేజీ యభివృద్ధిపరచు విషయమున ఆర్థిక సమస్యల నాలోచింపక ఏమిచేయుటకు వీలులేదని కూడ ప్రకటన యందుదహరించి యుండిరి. కాలేజీ యభివృద్ధికి తోడ్పడకపోతే స్థిరత్వమెట్లా సిద్ధిస్తుందో విద్యార్థులకు గోచరించలేదు. వెంటనే తిరిగి విద్యార్థులు,

i. ప్రస్తుత బడ్జెట్టులోంచి కావలసిన ధనం మంజూరు చేయాలి.

ii. ఇండియన్ మెడికల్ కవున్సిలు వారిని సంతృప్తి పరచాలి అనే వాగ్దానాలు చెయ్యమని కోరుతూ, ప్రభుత్వం వారిని జూలై 25 వ తేదీ లోపుగా అభిప్రాయాన్ని వెలిబుచ్చవలసిందిగా కోరారు. ప్రభుత్వం విద్యార్థుల కోర్కెలను లక్ష్యపెట్ట లేదు. ఆంధ్ర విశ్వవిద్యాలయం, మదరాసు ప్రభుత్వముల యొక్క నిరసనకు విసుగెత్తి, హిందూదేశంలో ఏ ఇతర మెడికల్ కాలేజికీ, లేని యీ దుర్గతిని తొలగించాలని కోరుతూ సమ్మె సాగించారు.

1. డిగ్రీలు రికగ్నైజు చెయ్యబోవడమంటే, హిందూ దేశములోని యితర ప్రాంతాల్లోను, మరి యితర దేశాలలోను ఉన్నత విద్య చదువుకొనే హక్కును ప్రత్యక్షంగా నిరోధించటం.

2. "రికగ్నైజుడ్ మెడికల్ పట్టాదారులతో ఆంధ్ర వైద్య పట్టభద్రులను సమానంగా చూడవలె ననెడి" చట్ట నిబంధనలులేని రాష్ట్రములందు ప్రభుత్వోద్యోగములందు ప్రవేశించుటకు గాని, న్యాయ సమ్మతమైన మెడికల్ సర్టిఫికేట్లు యిచ్చుటకు గాని వీలులేదు. ఈపై న్యాయమైన కోర్కెలతో కూడిన విద్యార్థుల సమ్మెపై ప్రభుత్వం దృష్టి మరల్పక తప్పింది కాదు. ప్రభుత్వం బడ్జెట్టులోంచి భవన నిర్మాణం కొరకు ఏర్పాటు చేస్తామని వాగ్దానం చేశారు. ముందు విద్యార్థులు కోరినప్పుడే ప్రభుత్వం యీ వాగ్దానాన్ని చేసియుంటే ఆంధ్ర మెడికల్ విద్యార్థుల సమ్మెయే అనవసరమై యుండేది. కాని భవన నిర్మాణపు పనులు ఇంకను ప్రారంభింప బడలేదు. పనులు తొందరగా జరిపింప వలసినదిగా కోరుటకు, మదరాసు, విశాఖపట్నం విద్యార్థి సంఘము కార్యదర్శులు డాక్టరు రాజన్‌గారిని కలుసుకొనగా ఒకసారి "రాయబారము ప్రయోజనము లేదనీ", మరొకసారి "ఎందుకనన్ను బాధ పెట్టెదరు మిమ్ముల నెవరిని చూడను" అని ప్రత్యుత్తరమిచ్చిరి. ఇదియేనా ప్రజా ప్రతినిధులు ప్రజా మంత్రి యొసగవలసిన సమాధానము?

మెడికల్ కాలేజీ విద్యార్థులు వినయ పూర్వకంగా ప్రభుత్వానికి తుప్పుపట్టిపోయిన సమస్యను విన్నవించుకొంటే ప్రభుత్వం సనేమిరాయంది. సమ్మెసాగితేనేగాని కాంగ్రెసు ప్రభుత్వమైనను తీవ్రసమస్యల విలోకించదు. అమ్మయినా అడగందిపెట్టదు. అందుచే ప్రజాశక్తిని వివిధవిధాలుగా ప్రభుత్వానికితెలియపర్చాలి, ప్రత్యేకంగా ఆంధ్రవైద్యపట్టభద్రులకు ఆంధ్ర విద్యార్థులకు జరుగుతున్న అన్యాయం తొలగించుకోవాలి. అట్లే ఇతరసమస్యలూనూ. మన ప్రధానామాత్యుల ఆంధ్రరాష్ట్ర సంచారంచేస్తున్నారు. వారి రాకను మనం పూర్తిగా వినియోగించుకోవాలి, విద్యార్థుల సమస్యలనన్నింటినీ, ఆంధ్రసమస్యలన్నింటితోబాటు వారికి నాటేటట్లు చెయ్యాలి.

### కార్యక్రమం

1. మీటింగులపై మీటింగులు సమస్యలు తీవ్రరూపం దాల్చేవరకూ ఆందోళన కొరకై చేయాలి. కాంగ్రెసు సోషలిస్టుపార్టీ, యువజన సంఘాల పూర్ణసహాయం ముఖ్యం. మీటింగులలో జరిగిన సంగతులను పూర్తివివరాలతో పత్రికలన్నిటికీ పంపాలి.

2. ప్రధానికి మెమోరాండములు ప్రతిచోటా అందచెయ్యాలి. ఆందోళనచెయ్యవలసిన విషయాలు:— విశాఖపట్టణం మెడికల్ కాలేజీ: బి. కాం, డిగ్రీలు, విద్యార్థులు రాజకీయాలలో పాల్గొనరాదని చేసినచట్టం, జీతముల హెచ్చింపు, పై 5 విషయములు మంత్రిగారికి సంతకాలతో కూడిన మెమోరాండము రూపంగా ప్రతిచోటా నలపాలి. ప్లేకార్డ్సు వ్రాతికెదురుకావాలి. వారిచెవులు గింగురులెత్తాలి.

# ఆరున్నర కోట్ల జర్మను అభాగ్యులు

శ్రీ పసుపులేటి భుజంగరావు.

జర్మనీలో నేడు 6½ కోట్ల జనసంఖ్య గలదు. కాని వారిభాగ్యసూత్రం 200 మంది ధనకుబేరుల చేతుల్లోవుంది. జర్మనీలో ప్రజలందరిమీదా యీకొద్దిమంది ధనాధికారుల ప్రభుత్వమే.

దేశంలో యావత్తుసంపత్తుమీదావచ్చే లాభాలన్నీ ఈలక్షాధికారులే మ్రింగి వేస్తారు.— ఈకొద్దిమంది వ్యక్తుల అంతులేని ధనపిపాస కొరకే జర్మనీలోనేడు ఆధునిక మారణ యంత్రాలు, నూతనసైన్యాలు బ్రహ్మాండంగా నిర్మిస్తున్నారు, వీరిస్వార్థాన్ని సాధించడానికే హిట్లరునేడు యూరపుఖండంయొక్క శాంతి నంతనూ భగ్నంచెయ్యడానికి పూనుకొన్నాడు.

దేశంపేరుమీద హిట్లరు పెద్దపెద్ద యంత్రాగారాలను నిర్మింపజేస్తున్నాడు, కాని అన్ని స్కీముల వెనుకా ఈ రెండువందలమంది పూంజీపతుల స్వార్థమూ దాగిఉంది, అనేక యంత్రాగారాలు కలసి పెద్దపెద్ద సిండికేట్సుగా స్థాపిస్తున్నారు, రోజురోజుకూ ఈపూంజీపతులు తమఐకమత్యాన్ని బలవత్తరమొనర్చుకొనుచున్నారు, హిట్లరు ప్రభుత్వం కూడా ఈస్కీముకు మంచిబలం చేకూరుస్తూ వున్నది. చిన్నచిన్న యంత్రాగారాలకంటె పెద్దయంత్రాగారాలవలన యుద్ధసమయములో మంచి సహాయం లభిస్తుందని హిట్లరు బాగుగాతెలుసుకొన్నాడు, ఈయంత్రాగారాలు తమయిచ్చవచ్చినరీతిగా సైన్యముకు ఆవశ్యకమగు సామాగ్రియావత్తూ తయారుజేయ గలవు. చిన్న చిన్న యంత్రాగారాలు లేకుండాజేసి పెద్దయంత్రాగారాలు స్థాపించటముతోనే పూంజీపతుల వుద్దేశ్యమూ నాజీగవర్నమెంటు వుద్దేశ్యమూ ఈయిరువురి వుద్దేశ్యాలు కూడా పరిష్కృతమవుతాయి. ఒకవేళ రేపు యూరపులో మహాయుద్ధం ఆరంభమైన యెడల ఈయంత్రాగారాలద్వారా పెద్దపెద్ద లాభాలు సంపాదింప వచ్చునని వారు తలుస్తున్నారు.

నాజీ ప్రభుత్వం యీ రెండువందల మంది లక్షాధికారుల ధనతృష్ణ కొరకు 6½ కోట్ల అమాయక ప్రజల స్వార్థానికి తిలోదకాలిస్తూ వుంది. ఈ రెండువందల మంది దురాశా పూరితులైన మానవరూపంలో ఉన్న జలగల అంతులేని పిపాసకొరకు పేద కార్మికు లందరూ పీల్చిపిప్పి చేయబడుచున్నారు. వారు దానిసలకంటె గూడహేయంగా చూడబడుచున్నారు. ఈ యంత్రాగారాలలో తయారయిన సరుకుల రాకపోకల సౌకర్యాలకు విశాలమైన రోడ్లను నిర్మింపవలసి వస్తోంది. యుద్ధ సామగ్రి విపరీతంగా తయారు చేస్తున్నారు. యుద్ధం చేయడానికి కందకాలు నిర్మిస్తున్నారు. ఇంకా అనేకమైన నూతన యుద్ధ పరికరాలు కూడా తయారు చేస్తున్నారు.

సత్యమైన విషయమేమంటే నాజీ జర్మనీ యీ కొద్దిమంది పూంజీపతుల ఆజ్ఞమీదా యే సమయంలోనో ఆకస్మికంగా యుద్ధాగ్ని జ్వలింప జేస్తుంది. యుద్ధ సమయంలోనూ శాంతి దినములలోనూ, రెండు దశలలో కూడా యీ పూంజీపతులు తమ జేబులు నింపుకుంటారు

ప్రపంచములో వున్నశాంతి ప్రియులందరూ నేడు జర్మనీ యొక్క యీ కపట నాటకాన్ని తెలుసుకొను చున్నారు. సంయుక్త సంఘటనతో ప్రపంచంలో తీవ్రశక్తులన్నీ యీ హిట్లరు స్కీమును నాశనం గావించడానికి ప్రయత్నిస్తున్నాయి. జర్మనీ యూరప్ ఖండానికంతకూ ఉపద్రవకరమైన దేశంగా ఉన్నది. అది రోజూ చేస్తూన్న గర్జనలతోటీ బందిపోటులతోటీ యే మాత్రమూ సంతృప్తి జెందుటలేదు—ఆస్ట్రియాను కబళించివేసింది. ఇప్పుడు జెకోస్లావేకియా మీద కాలు దువ్వుతూవుంది. ఇతర దేశాలు జర్మనీ చేస్తున్న చేష్టలకు యే ప్రకారమైన ఆటంకం కలిగించినా కేవలం యూరపులోనే కాకుండా సమస్త ప్రపంచములోనూ యుద్ధజ్వాలలు ప్రజ్వలింప జేయడంలో నాజీ జర్మనీ యే మాత్రమూ సంకోచింపదు.

# వ్యవసాయ కూలీ సంఘాలకు రైతు సంఘాలకు మధ్య ఎట్టి సంబంధ ముండాలి

### మొదటి సూచన

(i) వ్యవసాయ కూలీల సంఘాలు రైతు సంఘాలకు (affiliate) అనుబంధ సంఘాలుగా చేయకుండా స్వతంత్రంగానే వుండాలి, కాని కూలీల సంఘాల్లో పనిజేసే వారున్నూ రైతుల్లో పనిజేసే వారున్నూ గ్రామాల్లో 15 రోజులకొక సారైనా కలసి విషయములను చర్చించి ముందు కార్యక్రమమును నిర్ణయించుకొన వలయును.

(ii) రైతులకు కూలీలకు తగాదాలు వచ్చినప్పుడు ఆర్బిట్రేషన్ కమిటీ ద్వారా తగాదాలను పరిష్కారము చేసుకోవలయును. ఆర్బిట్రేషన్ బోర్డులో యీక్రింది వారుందురు.

(a) జిల్లా రైతు సంఘమునుండి యిద్దరు.
(b) జిల్లా కూలీ సంఘమునుండి యిద్దరు.
(c) జిల్లా సోషలిస్టు పార్టీనుంచి ఒకరు.

ఈ ప్రతినిధులను జిల్లా కార్యనిర్వాహక వర్గాలు నియమించును. సోషలిస్టు పార్టీ నుండి వచ్చు ప్రతినిధి యీ బోర్డుకు ప్రెసిడెంటుగా యుండును. ఈ సంఘము వారు మరల నూతన సంఘము వచ్చువరకు పనిచేయుదురు.

(iii) జిల్లా కూలీ సంఘముల సభలకు కూలీ సంఘమువారు ఆహ్వానించిన జిల్లా రైతు సంఘపు కార్యనిర్వాహక వర్గమువారు సౌహృద్రప్రతినిధులను (Fraternal delegates) ను పంపవచ్చును.

* * *

### రెండవ సూచన

వ్యవసాయ కూలీ సంఘాలు గ్రామాల్లో ప్రత్యేకముగా ఉండవలయును. కాని జిల్లాల్లో జిల్లా వ్యవసాయకుల సంఘము అనునది ఒకటి ఉండాలి. ఈ సంఘమునకు గ్రామములోని రైతు సంఘాలు, కూలీ సంఘాలు చేరియుండాలి. ఈ వ్యవసాయకుల సంఘ నిర్ణయములను గ్రామములలోని రైతు సంఘాలూ కూలీ సంఘాలూ శిరసా వహించాలి,

* * *

[కాని ప్రస్తుతము అన్ని జిల్లా రైతు సంఘాలు గాని, అన్ని జిల్లా వ్యవసాయ కూలి సంఘాలు గాని దీనికి ఒప్పుకొనవు. పైగా అన్నీ కూడ సరిగా పనిచేయడము లేదు. ఇవి సరిగా పనిచేసే లోపల, మొదటి తీర్మానములో సూచించిన రీతిని పని చేయడము తప్పని సరియైనను రెండవ సూచనను అమలులోకి తేవడానికి పూర్తిగా కృషి చేయాలని కొంతమంది పార్టీ సభ్యులు అభిప్రాయ పడ్డారు,

దీని విషయమై పార్టీ సభ్యులు, రైతు సేవకులు, వ్యవసాయ కూలీల మధ్య పనిచేయువారు తమ అభిప్రాయములను పంపప్రార్థన.

—సంపాదకుడు]



# కేవలం ఆర్థిక హక్కులకై పోరాడుట మాత్రమే రైతు వుద్యమ ఆశయం కాదు

## రైతు ఉద్యమంయెడల సోషలిస్టుల వైఖరి

(గతరెండు సంచికలలో జాతీయ కాంగ్రెసు - సోషలిస్టులు, ఆందోళనావిధానము అను రెండు తీర్మానాలు ప్రకటించాము. ఇది రైతు వుద్యమాన్ని గురించిన తీర్మానం. ఇదే సంచికలో మరొకచోట, యువజన సంఘాలు, వ్యవసాయ కూలీలు, వ్యవసాయ కూలీలకు - రైతులకు గల సంబంధమును గురించిన తీర్మానాల్ని గూడ ప్రకటించు చున్నాము. ఇవన్నీ క్రిందటి సోషలిస్టులసమావేశంలో గావించిన తీర్మానాలు. ఇవి కేవలం తీర్మాన రూపంలో గాకుండా, ఆయా ఉద్యమాల్లో సోషలిస్టుల దృక్పథాన్ని తెలియజేసి "థీసిస్" లాగా ఉన్నాయి. ఇవి సోషలిస్టులే గాక ఇతరులు కూడ శ్రద్ధతో పఠించ దగినవి— సంపాదకుడు)

ఆంధ్ర దేశములో రైతు సంఘములు సంఖ్యలోను, సభ్యత్వములోను అభివృద్ధిపొందినప్పటికిని, రైతు ఉద్యమము తగినంత శాస్త్రీయమైన అభివృద్ధి పొందినదని చెప్పుటకు వీలులేదు. రైతు సంఘాలలో సోషలిస్టులు పని చేయు చున్నప్పటికిని, రైతు సంఘములను, జాతీయైక్య సంఘటనకు నిజమైన ప్రాతిపదికలుగ ఏర్పరచజాలక పోయారు. కేవలం, సభ్యులను అభివృద్ధి చేయుట, సంఘాలను విరివిగా స్థాపించుట, ఆందోళన విరివిగా చేయుట ద్వారానే రైతు సంఘములలో పని చేశారు. జాతీయ ఉద్యమంతో తగినంత సంబంధను పెట్టుకోలేక పోయారు.

రైతు సంఘాల తరపున, రైతు కష్టాలను నివారించుటకు రైతు యాత్రలు అనేకము సల్పారు; అనేక ప్రదర్శనములు చేశారు; సభలు పెట్టారు; కొన్నిచోట్ల పోరాటమును గూడ నడిపారు. వాటి అన్నిటివల్ల, రైతులలో గొప్ప చైతన్యము కల్గిన మాట నిజమే. రైతుల శక్తులను రేకెత్తించి సంఘటించిన మాట వాస్తవమే. ప్రత్యేకంగా రైతు సంఘాలు ఒక శక్తిగా పరిగణింపబడిన మాటయు సత్యమే. సోషలిస్టులమైన మనకు, ఈ వివిధ శక్తులు ఎంతవరకు రాజకీయాభి వృద్ధికి, అనగా జాతీయ వుద్యమమునకు తోడ్పడినది పరిశీలించ వలసివుంది. ఎందుకనగా, రైతు సంఘాల యెడల మనకున్న దృక్పథము ఇది:—(1) రైతు సంఘాల ద్వారా, రైతు లందరిని, వారి కష్టములను నివారించుకొనుటకు సంఘటనపరచి, ఒక శక్తిగా చేయుటకును: (2) కేవలం యీ శక్తిని తమ వర్గ హక్కులకొఱకు పోరాడునట్లు చేయుటేగాక దేశ స్వాతంత్ర్యము కొరకు పోరాడి తద్వారా తమకు విముక్తి కలుగజేసుకొనుటకు తగిన రాజకీయ చైతన్యము కలుగ జేయుటకును, రైతు సంఘాలు పాటుపడునట్లు చేయుట మన విధి.

ఇప్పుడు మనము చాల క్లిష్ట దశలో ఉన్నాము, ఒక వైపున, రైతు సంఘాలు కాంగ్రెసుకు వ్యతిరేకమనియు, జాతీయోద్యమమును బలహీన పరచుచున్నవనియు, కాంగ్రెసు వారిలో కొందరు ఆరోపణలు చేయుచున్నారు: రైతు వుద్యమములోనే, ఒక కేంద్రీకరణమైన-ఐకమత్యముతో కూడిన-ఒకే-నాయకత్వము రాలేదు, మన రాష్ట్రములో రైతు నాయకుడైన రంగాగారితోను, వారి అనుచరులతోను, సరియైన సంబంధము లేకుండవుంది, ఇదీగాక కాంగ్రెసు సంఘాలతో చాల తక్కువ సంబంధము కలిగి, కొన్ని అనవసర తగాదాలతో మరింత దూరమైపోవు చున్నాము. ఈనాడు రైతు సంఘాలు కాంగ్రెసు సంఘాలతో కలసి పనిచేసి, జాతీయైక్య సంఘటనవభివృద్ధి గావించుటకు మన రాష్ట్రములో అనేక అవకాశములున్నవి. దాని అర్థం, కాంగ్రెసు నాయకులందరు రైతువుద్యమమును అంగీకరించి సహాయపడుదురనుకాదు. కాంగ్రెసు సంఘ కార్యక్రమము ద్వారాను, రైతు సంఘాల కార్యక్రమము కోర్కెల యెడల వెల్లడించే వైఖరి ద్వారాను, జాతీయైక్య సంఘటనకు హెచ్చు అవకాశములున్నవని బోధపడుచున్నది, ఏలనన, ఆం॥ రా॥ రైతు సంఘ కనీస కోర్కెల ప్రణాళికను, ఆం॥ రా॥ కాం॥ సంఘం అంగీకరించి యున్నది. రైతు యాత్రలు సాగించేటప్పుడు, జిల్లా, తాలూకా కాంగ్రెసు సంఘములు సహాయపడినవి, కావున ఈ రోజున రైతు సంఘములు కాంగ్రెసుకు దూరమైపోకుండ కాంగ్రెసు సంఘములతో కలసి పనిచేయుచు, జాతీయోద్యమమును బలిష్టమొనర్చుటకు అవకాశములు హెచ్చుగా నున్నవి.

ఇదేగాక, మన పరిస్థితులు రోజు రోజు మారుచున్నవి. దరఖాస్తులు, రాయబారముల తోనే కాలము గడుపక, అన్ని ప్రాంతముల లోను, ముఖ్యంగా, జమీందారీ ప్రాంతములలో రైతులలో గల్గిన చైతన్యము వలన పోరాటమును రైతులు సాగించుచున్నారు. ఈ పోరాటములలో ఇంతవరకు మనము నిర్దిష్టమైన కార్యక్రమము నిచ్చియుండలేదు.

ముఖ్యంగా ఈ పోరాటములే మన జాతీయైక్య సంఘటనను పెంపొందుచుటకు ఆధారములు, ఇట్టి పోరాటముల ద్వారానే నికరమైన జాతీయైక్య సంఘటన ఏర్పడుతుంది, మన సంఘములు తృప్తికరముగ పని చేయకుండుటకు రోజు రోజు కష్టాలను పోగొట్టుకొనుటకు కల్గుచున్న యీ చిన్ని పోరాటాలను నిర్లక్ష్యముచేసి, దైనందిన కార్యక్రమమును మరచిపోయి వుండుటచేతనే, జాతీయైక్య సంఘటనను నిర్మించుటకు ముఖ్యమైన ఈ దైనందిన కార్యక్రమమును మరచినప్పుడు జాతీయైక్య సంఘటనావశ్యకతను కూడ మరచిపోతిమి.

పై విమర్శనను బట్టి యీక్రింది విధముగ మనము సత్వరమే పూనుకొని పని చేసిననేగాని మన రైతు వుద్యమము శాస్త్రీయముగ పని చేయజాలదు.

1. ప్రప్రథమములో, వేరు వేరు భావములతో పని చేయుచున్న అనేక గ్రూపులను ఒక ఐక్య కార్యక్రమమును ఆధారముగా చేసుకొని కలసి, ఇప్పుడున్న అడ్డంకులను తొలగించుకొనుట (ముఖ్యంగా, రంగాగారితోను, వారి అనుచరులతోను సునిష్టమైన సంబంధము [illegible] పెట్టుకొని దైనందిన కార్యక్రమములో సహకార భావముతో పనిచేయుట.)

రైతుల యొక్క కష్టాలు. రైతు సంఘాలు తెలిసికొని వెంటనే స్థానిక కాంగ్రెసు కమిటీలకు తెలియజెప్పి, వారు అంగీకరించినచో జాయింటు నాయకత్వమున, లేకున్న కాంగ్రెసు నాయకత్వముననే, రైతు సంఘాలు అదికూడ అంగీకరించ నప్పుడు, స్వయముగను, రైతు సంఘాలు రైతుల కొరకు పాటుపడాలి.

రైతు సంఘాల పని వేరుగ భావించక జాతీయ కార్యక్రమములో ఒక భాగముగ నెంచుచు జాతీయైక్యతకు రైతు ఉద్యమం తోడ్పడునట్లు చేయాలి.

కాంగ్రెసు కమిటీలతో జాయింటు సంఘాలు ఏర్పరచి ప్రతిస్థానిక కాంగ్రెసు సంఘము కూడ, రైతుల దైనందిన కార్యక్రమములో, పోరాటములో పాల్గొనునట్లు జేయాలి.

రైతు సంఘాలు, కాంగ్రెసు సంఘాలకు పోటీ సంఘాలుగా వుండునట్లు వుండకూడదు. కాంగ్రెసులోని ప్రజాసామాన్య మంతకు రైతు సంఘాల పనికూడ ముఖ్యమైన కాంగ్రెసు పనే అనే భావము గలగాలి. ఇది, పనిద్వారానే చూపెట్టు గలుగుతాము.

ఎచ్చట, స్థానిక కాంగ్రెసు సంఘాలు మన కార్యక్రమమును అంగీకరించి పూర్తిగ పని చేయుట కిచ్చగించునో అచ్చట కాంగ్రెసు సంఘ పెత్తనము క్రిందనే పని సాగించాలి. మనము పెత్తనము వదలివేయుటకు సిద్ధపడి వారితో కలసి కొనవరకు, పని జేసేటట్లు చూడవలెను. పెత్తనము కాంగ్రెసు తీసికొన్నను, అట్టి పరిస్థితులలో నిజముగ మనమే ముఖ్యపాత్ర వహించి పని చేయవలయును గాన మనకు పలుకుబడి ఏమీ వుండదనే భయము అవసరములేదు.

రైతు సంఘము తరపున చేయు ప్రతి పనికి కాంగ్రెసు సహాయమును, కాంగ్రెసు మద్దత్తును స్వీకరించవలెను.

2. ఇప్పుడు మనము చేయుచున్న ఆందోళనా పద్ధతులతోనే తృప్తిచెందక, వెనువెంటనే నిర్మాణ సమస్యలకు ఎక్కువగా ప్రాముఖ్యత నీయవలెను. ఈ క్రింది విధముగ నిర్మాణమును వెంటనే ఏర్పాటు చేయవలెను.

ప్రతి రైతు కార్యకర్తను నిర్ణీతమైన ప్రాంతములో [illegible] నిర్ణీతస్థలములలో పనిచేయవలెను. రైతు సంఘాలను స్థాపించుటలోను, సభ్యులను చేర్పించుటతోనే మన రైతు కార్యక్రమం పూర్తికాకూడదు. ముఖ్యంగా, స్థానిక సంఘములు స్థానిక ఇబ్బందులను గూర్చి పని చేయుటకు పూనుకొనేటట్లు చేయాలి. క్రింది సంఘాలు జిల్లాలోని కేంద్ర సంఘముతో ఎప్పటికప్పుడు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుతూవుండేలాగున చేయుట ఆ స్థానిక వర్కర్ల, ముఖ్యముగా ఆచ్చటి పార్టీ సభ్యుల విధి. గ్రామ సంఘాలలో చేర్పించునప్పుడు, పేద రైతులు, మధ్య తరగతి రైతులును హెచ్చుగా చేరునట్లు మన పార్టీ సభ్యులు చూడాలి.

రైతు వాలంటీరు దళములను, గ్రామమున కొకటిగాని, లేక కొన్ని గ్రామముల కొకటి గాని వెంటనే ఏర్పాటు చేయవలయును.

### వెనువెంటనే ఆచరణ యోగ్యమైన కార్యక్రమము.

రైతుల దైనందిన కష్టములను తొలగించుటకు, చేయుచున్న పోరాటములు. ఇంతవరకు ఈ పోరాటముల విషయములో చాల అశ్రద్ధ వహించియుంటిమి. ఇకముందు, ముఖ్యముగా జమీందారీ రైతు ప్రదేశములలో వెనువెంటనే వచ్చుచున్న రైతు పోరాటములను ఆర్గనైజు చేసి సర్వతోముఖముగా అభివృద్ధి చేయవలయును. రైతు పోరాటములను నడుపుటకు సంసిద్ధులమై యుండవలెను. అవసరమైతే ప్రత్యక్ష చర్యలకు కూడ కొన్ని ప్రదేశములలో పూనుకొన వలెను.

ప్రతి జిల్లాలో, ఒక నిర్ణీత కాలములో చేర్పించవలసిన సభ్యుల మొత్తము సంఖ్యను నిర్ణయము చేసి, ఆ సభ్యులను చేర్పించుట పూర్తియగునట్లు చూడవలెను.

లేనిచోట్ల క్రొత్త సంఘములను ఏర్పరచు సమస్యను గురించి, వెనుకబడిన ప్రదేశాలలో హెచ్చుగా ఆందోళన ద్వారా ప్రచారము సాగించవలెను. ఎచ్చట మనకు రైతు సంఘాలు విరివిగా నున్నవో అచ్చట మన బలమును స్థిరపరచుకొని అచ్చటి ఉద్యమమును నిర్మాణయుక్తముగ ఏర్పరచ వలెనే గాని, అన్నిచోట్ల ఏమి నిర్మాణము లేకుండ సంఘాలను విరివిగ స్థాపించి, అన్నిచోట్ల వచ్చు సమస్యలను ఎదుర్కొన అశక్తులమై పోరాదు.

వెనువెంటనే అన్ని సంఘములను కలుపుకొని ఐక్యకంఠముతో పోరాడుటకు వీలుండునట్లు ఒక కార్యక్రమమును నిర్ణయించి, దానిని సాధించుటకు, తద్వారా అన్ని సంఘములకు మధ్య సునిష్ట సంబంధము ఏర్పరచునట్లు చేయవలయును. ఈ క్రింది కోర్కెలనాధారముగా గైకొనవలెను.

(1) ఎస్టేటు ల్యాండు యాక్టు సవరణకై ఆందోళన (2) అడవుల ఇబ్బందులు (3) మైనరు ప్రాజెక్టుల నిర్మాణము (4) (లంచగొండితనము)

(మిగతా 18 వ పేజీలో)

# వ్యవసాయ కూలీలకు ప్రత్యేక సంఘాలు అవసరమే

## రైతుల-కూలీల సామరస్యానికి మనమేమి చేయాలి?

### వ్యవసాయ కూలీల గురించి సోషలిస్టుల తీర్మానం.

**నిర్వచనము**

వ్యవసాయ సంబంధమగు పనులలో కూలి చేయువాడు వ్యవసాయ కూలి యనబడును.

**పరిస్థితులు**

నేటి సమాజంలో పీడింపబడే వర్గాలలో వీరు ఒక ప్రధానవర్గంగాయున్నారు. వీరియొక్క జీవితమంతా కూలిమీదనే ఆధారపడి యుంది. పాలేర్లుగా వున్నవారికి తప్ప తక్కినవారికి సంవత్సరంలో సగంభాగం పనిదొరకదు. దినవేతనాలు 0-1-6 నుండి 0-6-0 వరకు యుంటుంది. బాగా పని ఒత్తిడికాలంలో రోజుకు 0-6-0 కొన్నిచోట్ల 0-8-0 కూలీ దొరుకుతుంది. కూలిలో కనీసపు కూలి నిర్ణయము లేదు. ఇది వేరువేరు తాలూకాలలో, గ్రామాలలో స్థానిక పరిస్థితులబట్టి వేరువేరుగా యుంటుంది. కూలి ధాన్యరూపంగాను, డబ్బు రూపంగానూ ఇవ్వబడుతుంది. వీరిలో దాదాపు అందరు అప్పులతో బాధపడుతుంటారు. గ్రామంలో నుండే ధనికరైతులు, చిన్న వ్యాపారస్థులు, కొందరు మధ్యతరగతి రైతులు వీరికి చాలా హెచ్చువడ్డీకి అప్పు ఇస్తుంటారు. ఎల్లప్పుడు చాకిరిచేస్తూ తాము ఎప్పుడో అప్పుగా పుచ్చుకొన్న చిన్న మొత్తాలనుకూడా వాళ్ళు జీవితకాలంలో ఎప్పుడు చెల్లించుకోలేక యుంటారు. కొన్ని స్థలాల్లో వీరు ధనికరైతుల ఇండ్లలో నెలలో కొన్ని రోజులు వుచితంగా కూడా (Free Labour) సేవ చేయవలసి యుంటుంది. మధ్యకాలపునాటి మూఢ నమ్మకాలు, ఆచార వ్యవహారాలు వీళ్లను క్రుంగదీసివేస్తూ యున్నవి. సంఘంలో నుండే పైతరగతులయొక్క ఒత్తిడినంతా వీరే అధికంగా భరిస్తారు. దాదాపు అందరూ తక్కువ కులాలు అనబడే కులాలకు చెందియుంటారు. పైకులాలు తరగతులు వీరిని అన్నివిధాల నీచంగా చూస్తారు. వీరిని రైతులు తిట్టటం, కొట్టటం తరచుగా యుంటుంది. దాదాపు బానిసలయొక్క జీవితం మాదిరిగా యుంటుంది వీరియొక్క జీవనం. వ్యవసాయ కూలీలలో అధికసంఖ్యాకులు మాల మాదిగలుగా నున్నారు. వీరియొక్క అవస్థ ఇంతా అంతాయని చెప్పనలవి కాదు. అసలే విద్యాసౌకర్యాలు తక్కువ. దానితోపాటు అస్పృశ్యతా పిశాచం వీరిని విద్యావిహీనులుగా మరింతగా చేసింది. ప్రభుత్వ పాఠశాలల్లోకి, బావులవద్దకు కూడ వీరికి అర్హతయుండదు. బ్రిటిషు ప్రభుత్వముయొక్క దోపిడీ విధానం మూలకంగా, కుటుంబంయొక్క వ్యాపకం మూలకంగా, పరిశ్రమలు ప్రోత్సహించబడక పోవుటచేత పూర్వము మధ్యతరగతి రైతులుగా యుండేవారు కాలక్రమేణా క్షీణించి, ఏమాత్రము భూమిలేక కూలి మీదనే ఆధారపడి యుండు వ్యవసాయ కూలీలుగా మారుచున్నారు.

కాని పైకులాలలో నుండు రైతులు క్షీణించిపోయి కూలీలుగా మారినప్పటికీ, కులాలయొక్క తీవ్రత సాంఘిక దురాచారాల ఫలితంగా ఆర్థికంగా ఒకే తరగతికి చెందినప్పటికీ పై కులాలకు చెందిన వ్యవసాయ కూలీలకు, క్రింది కులాలకు చెందిన కూలీలకు మధ్య కావలసినంత స్నేహభావము కలిగించుటలేదు. బీదరైతులు కూడా హీనకులస్థులైన కూలీలను పీడించుటవల్ల రెండు తరగతులమధ్య నుండు వైషమ్యాలు వీరిద్దరికి మధ్యకూడా ప్రవేశించుచున్నవి. ఇవి ఒక్కొక్క స్థలంలో తీవ్రమగు తగాదాలకు కారణమవుతూ యున్నవి. రాచకీయంగా వ్యవసాయ కూలీలు చాలా వెనకబడి యుందురు. ఇంతవరకు కాంగ్రెసు ప్రచారము మధ్యతరగతి రైతులవరకు వ్యాపించింది. అసలు గ్రామానికి వేరే దూరంగా యుండే అస్పృశ్యులనబడేవారి ఆర్థిక రాజకీయాభివృద్ధికి తోడ్పడుటలో మన నాయకులు, రాజకీయ వేత్తలు, నిర్లక్ష్యంచేసిరి. హిందూ సంఘం అంతా మాల మాదిగలను పూర్తిగా ఎంతో కాలమునుండి అణగత్రొక్కుతూ యుంటే క్రైస్తవ మతస్థులు వచ్చి వారిలో కొందరికి కొంతవరకు ఆశ గొల్పించారు. విద్యకు, సాంఘిక గౌరవానికి కొంతవరకు విదేశీయులు మతరూపేణా తోడ్పడ్డారు. ఈ కారణాలవల్ల వీరిలో జాతీయ చైతన్యం చాలా తక్కువగా యుంటుంది, కొన్ని స్థలాల్లో జాతీయ వుద్యమం యెడల ద్వేషభావం కూడా గల్గింది.

**ఉద్యమ చరిత్ర**

వ్యవసాయ కూలీ వుద్యమంలో పనిచేయటానికి అనేకులు అనేక వుద్దేశాలతో బయలుదేరారు. అమాయకులకు ప్రజలతో కొంతవరకు సంబంధం కలుగచేసుకొని, కొన్ని సౌకర్యములు కలుగచేసి వారిపైన పెత్తనం వహించటానికై, పంచాయితీబోర్డు మొదలగు వాటిలో పదవులు బడయటానికై కొందరు ఆ వుద్యమాన్ని బయలుదేరతీసారు. కుల వైషమ్యాలు ఆధారంగా చేసుకొని తాము తమ కులమును వుద్ధరించటానికై కంకణం కట్టుకొన్నామంటూ, కొందరు కులస్థులనుండే వ్యవసాయ కూలీ వుద్యమం అంటూ బయలుదేరారు. కాంగ్రెసులో వున్నత పదవులు దొరకనివారు, రైతు ఉద్యమం, రైతు నాయకుల యెడ వ్యక్తిగత ద్వేషాలుగలవారు కూడా ఈ వుద్యమంలో పనిచేయ సాగారు. రైతు ఉద్యమంయొక్క అభివృద్ధిని చూచి భయపడి రైతుకు, కూలీల తగాదాబెట్టి కూలీలను తమ పక్షము చేసుకొని రైతులను త్రొక్కిపెట్టుటకై కొందరు ఈ వుద్యమం లేవదీసారు.

వ్యవసాయ కూలీలు దేశంలో పీడింపబడే వర్గాలలో ఒకరు, అధిక సంఖ్యాకులు, ముఖ్య విప్లవ శక్తులలో నొకటి. వీరియొక్క పేద రైతులయొక్క తదితర రాజకీయ శక్తుల యొక్క జాతీయ ఐక్యసంఘటన అత్యంత అవసరమని గుర్తెరింగిన సోషలిస్టులు మరియొక వైపునుండి ఈ వుద్యమం ప్రారంభించారు.

1934 సంవత్సరము నుండి ఈ వుద్యమం ప్రారంభమయిందని చెప్పవలసియుంది. కాని ఈ పని ఎవరికి తోచినట్లు వారు తమ తమ స్థలాల్లో చేసేవారు. నెల్లూరు జిల్లాలో కూలీల సంఘాలు వ్యవసాయ కూలీలలో కొందరి ఏనాదులపైన C. T. యాక్టు మొదలగు నిర్బంధములను చాలవరకు తగ్గించుటకై తోడ్పడ్డది. గ్రామాల్లో సభలు పెట్టు చున్నప్పటికి ఏవో కొన్ని గ్రామాలలో తప్ప సంఘాలు ఏర్పడలేదు. మొదటిసారి గుంటూరు జిల్లాలో 1934 లో కరపత్రముల ద్వారా కూలీల కష్టాల గురించి వారికి ప్రబోధము చేయుచు ప్రచారము సాగింది. ప్రభుత్వమువారు వుద్యమాన్ని మొదటనే త్రొక్కివేయటానికి ప్రయత్నం చేశారు. ప్రెస్సు యాక్టు వుపయోగించారు. అంతటితో ఉద్యమం కొన్ని నెలలు ఆగిపోయింది. తిరిగి 1936 ఆఖరులో కొన్ని సంఘాలు ఏర్పడ్డాయి. రాత్రి పాఠశాలలు కూడా నడపబడ్డాయి. నెల్లూరు జిల్లాలో చాల సమ్మెలు జరిగాయి. 1937 మొదటిసారి నామమాత్రమున ఆంధ్ర రాష్ట్ర వ్యవసాయ కూలీ సంఘము నెల్లూరులో స్థాపింపబడింది. ఈ ఉద్యమాన్ని విప్లవ పద్ధతుల మూలకంగా పెంపొందించటానికి రైతుల యెడ స్నేహభావం సాధ్యమైనంత వరకు గల్గించటానికి వీరు ప్రయత్నించ లేదు. తరువాత కొద్ది నెలలకు ఈ రాష్ట్ర సంఘంలో సోషలిస్టు వ్యక్తుల యొక్క ప్రవేశం ఎక్కువగా కల్గింది. కాని సంఘంలో చేరిన నాయకులందరి మధ్య ఏకాభి ప్రాయము, సఖ్యత ఏమాత్రం లేదని చెప్పవలసియుంది. ఇంతవరకు నిర్ణీత నియమావళి గాని, కార్యక్రమంగాని లేదు. ప్రాథమిక సంఘములకు రాష్ట్ర సంఘముకు సంబంధం బొత్తుగాలేదు. 1938లో కొన్ని జిల్లాలలో జిల్లా సంఘాలు, జిల్లా మహాసభలు జరిగాయి. డబ్బు ఇచ్చి ఏజంట్లను ఏర్పరచి వ్యవసాయ కూలీ సంఘాలు స్థాపించటం మొదలుపెట్టారు. వ్యవసాయ కూలీ సమస్య ఈ సంవత్సరంలోనే రాచకీయంగా ప్రాధాన్యత వహించటం గల్గినది. సోషలిస్టులు దానియొక్క ప్రాముఖ్యత పూర్తిగా గ్రహించగల్గి తీవ్రముగా ఈ సమస్య విషయం చర్చలు చేయగల్గారు. పత్రికల్లో ఈ విషయమై వ్యాసాలు ప్రకటింపబడ్డాయి.

**ప్రత్యేక సంఘాలు ఎందుకు అవసరం?**

విద్య, ఆచారాలు, సాంఘిక మర్యాదలు వునికి వీటిల్లో రైతులకు కూలీలకు చాలా వ్యత్యాసాలున్నాయి. రాచకీయ చైతన్యం రైతులలో చాలినంత లేనందువల్ల, కూలీలలో అసలే లేనందువల్ల ప్రస్తుతంలో రైతులు, కూలీల మధ్య తీవ్రమైన తగాదాలున్నవి. పరస్పరంలో విశ్వాసం అసలేలేదు. కులభేదం వల్ల పేద రైతు కూడా పేద కూలీని చాలా నీచంగా నిర్దాక్షిణ్యంగా చూస్తారు. వీరిద్దదిని ఇట్టి పరిస్థితులలో ఒకే సంఘంలో చేర్చుట అసంభవం అని అనుభవం అని అనుభం తెలియపరస్తాయుంది. అంత మాత్రాన వీరిద్దరు పరస్పర విరుద్ధమగు రెండు తరగతులని తలంచి వర్గ పోరాటము వీరిద్దరి మధ్య తీసుకొని రాకూడదు. ఈ విధంగా కొందరు రాచకీయ జ్ఞానం ఏమాత్రము లేనివారు. అపోహబడు చున్నారు. కాబట్టి వేర్వేరు సంఘాలు వ్యవసాయ కూలీలకు చాలా అవసరం.

ప్రత్యేక సంఘాల యొక్క అవసరం గుర్తించిన మన కామ్రేడ్సు రైతు కూలీ సఖ్యత కొరకై, వీరిద్దరి మధ్య నుండు తాత్కాలిక సంఘర్షణ కొరకై తీవ్రప్రచారము ద్వారా ఈ రెండు శక్తులను సమ్మిళతము చేసి సామ్రాజ్య ప్రతికూల పోరాట ముఖంగా వీరి దృష్టి మరల్చుటకై నిరంతరం పని చేయాలి. రైతు సంఘాల్లో, కూలీ సంఘాలలో పెత్తనం మన పార్టీవారు పూర్తిగా వహిస్తే చాల భాగం తగాదాలు చాకచక్యంగా తప్పించవచ్చును.

**రైతు సంఘాల్లో పనిచేయు పార్టీ సభ్యులు గమనించ వలసిన విషయాలు.**

(1) సంఘము స్థాపించుటకు ముందు గ్రామములో సభ పెట్టి దేశములో ముఖ్యమగు రాచకీయ ఆర్థిక పరిస్థితులు, ముఖ్యంగా రైతుల దుస్థితి, కాంగ్రెసు సంఘము మొదలగు వాటిని గురించి విపులంగా బోధించాలి. పిదప సభ్యులను చేర్చి సంఘములుగా ఏర్పాటు చేయవలయును.

(2) రైతుల యొక్క పోరాటములో కేవలం రైతుల యొక్క బలము చాలదనియు, రైతు యొక్క క్షేమం, పోరాటము యొక్క అభివృద్ధి, వ్యవసాయ కూలీల మీద కూడా ఏ విధంగా ఆధారపడిందో, రైతు కూలీల మధ్యనుండు తగాదాలు జమీందారులకు, ప్రభుత్వానికి ఏ విధంగా సహాయ పడుచున్నదో కూలీల సంఘాలు రైతులను ఎదిరించుటకు గాక తమ కష్టములను పోగొట్టుకోడానికేన్నీ, రాచకీయ పోరాటానికై స్థాపింపబడు చున్నవన్నీ, నేడు కూలీలు కోరు కోర్కెలు చాలా సామాన్యమైనవన్నీ బోధచేయాలి.

(3) రైతు పాటలతోపాటు, కూలీ పాటలు నినాదాలు కూడా చెప్పాలి. రైతు సభల్లో కూలీల హక్కులకొరకై కూడా తీర్మానాలు పెట్టాలి. (ఆచార్య రంగాగారి వ్యవసాయ కూలీలను గురించిన కరపత్రం)

(4) పీడాకరమగు ప్రభుత్వ ఆర్థిక విధానంవల్ల, రైతులు కాలక్రమేణ క్షీణించిపోవుటచేతనే వ్యవసాయ కూలీల సంఖ్య పెరిగిపోతుందని ఋజువు చేయాలి.

(5) ప్రతిసభలో ఎర్రజెండా వుపయోగిస్తూ రైతు, కూలీ సమ్మేళనాన్ని గురించి వివరిస్తూ రష్యా వుదాహరణగా చెప్పాలి.

(మిగత 11 వ పేజీలో)



# ఆంధ్ర దేశంలో యువజనోద్యమం

## వలంటీర్ల దళాల్ని విరివిగా స్థాపించాలి.

### యువజనోద్యమము గూర్చి సోషలిస్టుల తీర్మానం.

1928-29 లలోను 1930-32 సంవత్సరాల మధ్య ఆంధ్రరాష్ట్రంలో, అక్కడక్కడ యువజన సంఘాలుండేవి. కాని ఈ యువజన సంఘములను సంయుక్తపర్చే, జిల్లా యువజన సంఘాలు కాని, రాష్ట్ర యువజన సంఘాలు కాని లేవు. వీటికి ఒకే విధమైన అభిప్రాయాలు కాని, కార్యక్రమం కాని ఉండేవి కావు. ఆ సమయాన గుంటూరులోని యువజన సంఘం బాగా పనిచేస్తూ వచ్చింది. యువజన సంఘంలోని అప్పటి సభ్యులంతా విద్యార్థులే. వీరు శాసనోల్లంఘ నోద్యమంలో బాగా పాల్గొని, మంచి శక్తిగా పరిగణింప బడ్డారు.

యువకులందరు ఎంతో ఉత్సాహంతో, కొద్దిలో స్వరాజ్యం సంపాదింప గల్గుగుదుమని శాసనోల్లంఘ నోద్యమంలో పాల్గొన్నారు. కాంగ్రెస్ నాయకత్వం ఉద్యమాన్ని రెండుసార్లు ఆకస్మాత్తుగా ఆపటంతో, కొంతమంది ఛోటా నాయకులలోను, ఉద్యమంలో పాల్గొన్న యువకులలోను అసంతృప్తి కల్గింది. కాంగ్రెసు గాంధిగారి నాయకత్వం క్రింద హరిజనోద్యమం ప్రారంభించి, రాజకీయోద్యమాన్ని వెనుకకు త్రోసివేయటం వల్ల ఈ అసంతృప్తి ఇంకా ఎక్కువయింది, కాని వీరికి, కాంగ్రెస్ యెడల కాని, నాయకత్వం అనుసరించిన పద్ధతుల యెడల కాని సరియైన విమర్శనా దృష్టి లేదు. దీనికి కారణం వీరిలో సరియైన రాజకీయ విజ్ఞానం లేకపోవుటయే.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఏర్పడిన తర్వాత విశాఖపట్టణంలో, ఈ యువకులు, ఈ ఛోటా కాంగ్రెస్ నాయకులు సమావేశమై 1935 జనవరిలో రాష్ట్ర యువజన మహాసభ జరిపేరు, అప్పటికే, కొంతమందికి సోషలిస్టులతో సంబంధము కల్గినది. అక్కడ చేరిన యువకులలో ముఖ్యమైన వారికి సోషలిస్టు భావాలు కొంతవరకు ఏర్పడియుండినాయి. ఇక్కడ ఏర్పడ్డ రాష్ట్ర కార్యనిర్వాహక వర్గములో సోషలిస్టులే, కార్యక్రమాన్ని సాగిస్తూ వచ్చారు.

అప్పటికి సోషలిస్టులు పూర్తిగా సెక్టేరియన్ దృక్పధం కల్గి ఉన్నారు. లేబర్ ప్రొటెక్షన్ లీగును పార్టీగా ఉపయోగించు తున్నట్లే యూత్ లీగ్‌ను ఇంకా విశాలమైన పార్టీగా ఉపయోగించే వారు. యువజన సంఘాల ద్వారా రాజకీయాందోళన, లేబర్ ప్రొటక్షన్ లీగ్ ద్వారా కన్న ఎక్కువ చేస్తూ ఉండేవారు. అక్కడక్కడ ఉన్న యువజన సంఘాలన్నిటిని రాష్ట్ర సంఘం క్రింద కేంద్రీకరించి, కార్యక్రమాన్ని ఇంకా ఎక్కువ తీవ్రంగాను, నిర్మాణ యుక్తంగాను కొనసాగించడానికి, ఆంధ్రరాష్ట్ర యువజన సంఘ సమావేశము మరొకటి కాకినాడలో జరిపారు. ఈ పర్యాయం నాయకత్వం పూర్తిగా సోషలిస్టులకు వచ్చినది.

ఇప్పటికి యువజన సంఘాలు ఆంధ్రరాష్ట్రంలో బాగా అభివృద్ధి చెందినాయి. సోషలిస్టులకు సెక్టేరియన్ దృక్పధం ఆలాగే వుండుటచేత యువజన సంఘాలద్వారా [illegible] ఆందోళన చేయబడ జరపటమేకాక, కాంగ్రెసు పనిని కూడా సాగిస్తూ ఉండేవారు, లేబరు ప్రొటెక్షను లీగు వారు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరిన తర్వాత కూడా, షుమారు 1 సంవత్సరం వరకు యువజన సంఘాల పనిని సరిగా అర్థంచేసికోలేక, యువజన సంఘాల ద్వారా అంతకు పూర్వం జరుపుతున్న కార్యక్రమాన్నే కొన సాగిస్తూ ఉండేవారు. కృష్ణా జిల్లాలో 1937 వ సంవత్సరం ఆఖరువరకు, యువజన సంఘాల తరపున కాం. సో. పార్టీ పనిని సాగిస్తూ ఉండే వారు.

1937 వ సంవత్సరం మార్చి నెలలో బందరులో, తృతీయ ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘపు కాన్ఫరెన్సు జరిగింది. ఇప్పటికి యువజన సంఘాల పాత్రను అర్థం చేసికొని, యువజన సంఘాలలో పని చేయుటకు నియమింపబడిన కామ్రేడ్సు తప్ప మిగిలిన సోషలిస్టులందరు యువజన సంఘాలనుంచి, బైటికి రావలయుననే నిశ్చయానికి వచ్చారు. ఆచరణలో ఇది కొంతవరకు మాత్రమే జరిగింది. కాని, యువజన సంఘాలు, యువకులకు ఆర్థిక, సాంఘిక, రాజకీయ, శారీరక, విషయాలలో తరిఫీదు నిచ్చే రంగాలుగా ఉండాలనే అసలు కార్యక్రమాన్ని అమలులో పెట్టక పూర్వమే, కొత్తపట్టణంలోని లాఠీచార్జి జరిగింది. ఈ విషయం మీద, యువజన సంఘాలు తీవ్రమైన ఆందోళన చేసినవి. తర్వాత కూడా, యువజన సంఘాలలో పనిచేయుటకు నియమింపబడ్డ వారిని అపని మీద ప్రత్యేక శ్రద్ధ వహించుటకు వీలు లేకుండా ఇతర ప్రజా సంఘాల పనిని చేయటానికి నియమించింది. ఇంతవరకు యువజన సంఘాలద్వారా చేస్తున్న ఆందోళనా కార్యక్రమం కూడా తగ్గిపోయింది.

1937 వ నవంబరు నెల పాలకొల్లులో రాష్ట్ర యువజన సంఘ కార్యనిర్వాహక వర్గం సమావేశమై, పైచెప్పిన వారిని దీనినుంచి తీసి వేసి ఇతర కామ్రేడ్సును ఈ పనికి నియమించింది. ఈ ప్రకారమే, జిల్లా కార్యనిర్వాహక వర్గములలో నుంచికూడా, యువజన సంఘాలలో పని చేయనివారిని తీసివేసి, ఇతర కామ్రేడ్సును నియమించాలని అనుకొన్నది. ఈపని సాగలేదు. దీనికి కారణం, పార్టీలో పనిని విభజించక పోవడం, సరియైన కట్టుబాటుతో పనిచేయక పోవటం, అనగా పార్టీ సరిగా పని చేయక పోవడం. చివరకు ఒక కృష్ణా, తూర్పు గోదావరి జిల్లాలలో తప్ప సాంవత్సరిక సమావేశాలు కూడా జరుగకుండా పోయినాయి.

యువజన సంఘాలు సోషలిస్టుల నాయకత్వము క్రింద నడుపబడుచున్న పార్టీ క్రింది సంస్థలు కావు. అయినప్పటికీ సోషలిస్టులు సెక్టేరియన్ దృక్పధంలో నడపడంవలన కాంగ్రెసు మితవాద నాయకులు యువజన సంఘాలను విరోధ భావంతో చూస్తునే ఉన్నారు. ఇంతేగాక యువజన సంఘాలు సోషలిస్టు పార్టీగా నడుపబడుటచే యువజన సంఘాలు ఎంత అభివృద్ధి చెందాలో అంత అభివృద్ధి చెందలేదు. అయినా కృష్ణాలో 120 మందికి, గుంటూ[illegible] 60 మందికి [illegible]

రాష్ట్రం మొత్తము మీద నేడు యువజన సంఘ సభ్యులు దాదాపు 2200 మంది. ప్రాథమిక సంఘాలు 170. కాని దినోత్సవములయినా జరుపునవి సుమారు 40 మాత్రమే ఉంటాయి. యువజన సంఘాలు అస్సెంబ్లీ ఎన్నికలలో పూర్తిగ పనిచేసి కాంగ్రెసు అభ్యర్థుల విజయానికి సాయపడినవి. రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుని అభివందనములు కూడ పొందినవి. కొంతమంది కా॥ సో॥ పార్టీ బాగా బలపడ్డది, యువజన సంఘాలు అనవసరం, మిగత యువజన కార్యక్రమం కాంగ్రెసు కమిటీల ద్వారా చేయవచ్చునని వాదించుచున్నారు, వీరి వాదనలు సరియైనవి కావని ఈ క్రింది కారణాలు ఋజువు చేస్తాయి.

(1) ఆటలు, పాటలు, వైజ్ఞానిక విషయాలు (cultural and out door activities) కాంగ్రెసు కమిటీల ద్వారా చేయించటానికి వీలులేదు.

(2) రాష్ట్ర యువజన సంఘంతో పరిచయం లేకుండానే కొన్నిచోట్ల యువజన సంఘాలు ఏర్పడుతున్నాయి, యువజన సంఘాలు రద్దు చేసే యెడల రియాక్షనరీలు ఈ సంఘాలను ఏర్పరచి యువకులను తప్పుత్రోవ పట్టిస్తారు.

(3) వాలంటీరు దళాన్ని ప్రస్తుతం ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏర్పరచక, ప్రోత్సహించక, నిరోధించునట్లు కూడ కనపడు చున్నది. అతివాదుల పలుకుబడిలో ఉన్న కాంగ్రెసు కమిటీల ద్వారా తప్ప తదితరచోట్ల వాలంటీరు దళాన్ని ఏర్పరచటం సాధ్యంగాదు. అతివాదుల పలుకుబడిలో ఉన్న కమిటీలు చాలా తక్కువ. కనుక ఇతర చోట్ల వాలంటీరు దళం యువజన సంఘాల ద్వారా ఏర్పచాలసిన అవుసరం ఉంది.

ప్రత్యేకంగా యువకులకు అవుసరమైన వైజ్ఞానిక శారీరక విషయాలలో తర్ఫీదు ఇవ్వటం ఇతర ప్రజా సంఘాల ద్వారా సాధ్యంగాదు. అందువల్ల ప్రత్యేకంగా యువజన సంఘాలుండటం అవుసరం ఉంది.

యువజన సంఘాలు వర్గ సంఘాలు కావు. అన్ని వర్గాలలోని యువకులను సంఘటన చేసి తరిఫీదు ఇయ్యాలి. యువకుల సాధారణ కోర్కెల కోసం ఆందోళన చేయాలి.

**కార్యక్రమము**

(1) ఆటలు. (2) అధ్యయన తరగతులు. (3) రాత్రి పాఠశాలలు. (4) లైబ్రరీలు (5) దినోత్సవాలు జరుపుట. (6) వాలంటీరు దళం. (7) యువకులను ఎదుర్కొనుచున్న ప్రధాన సమస్య అయిన యువకుల విద్యాభివృద్ధి, నిరుద్యోగమును తొలగించడానికి ప్రభుత్వాన్ని వత్తిడిచేయుట (7) కాంగ్రెసు, ఇతర ప్రజా సంఘాలకు సహాయం చేయుటం.

**వాలంటీరు దళం**

కాంగ్రెసు కమిటీలు వున్నచోట్ల వాటి [illegible] ఆమాన్యం క్రిందనే వాలంటీరు దళాన్ని ఏర్పరచాలి. ఇతరచోట్ల యువజన సంఘాలు ఇతర ప్రజా సంఘాల సహకారాన్ని తీసుకొని ఏర్పరచాలి. కాని, కాంగ్రెసు వాలంటీర్ల దళంతో యువజన వాలంటీరు దళం వీలు దొరికిన వెంటనే కలపాలి.

**పై కార్యక్రమాన్ని కొనసాగించటానికి పార్టీ చెయ్యాలిసిన పనులు.**

(1) వెంటనే రాష్ట్ర, జిల్లా ఆఫీసులు పెట్టించి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగేటట్లు చూడాలి.

(2) రాష్ట్ర సంఘానికి ఒకరినీ, ప్రతి జిల్లాకు ఒక్కొక్కరినీ పార్టీ సభ్యులను బాధ్యులుగా పార్టీ నియమించాలి. వీరికి ఇతర బాధ్యతలు ఉండకూడదు.

(3) పైన ఉదహరించిన బాధ్యులు కమిటిగా ఏర్పడి కార్యక్రమాన్ని అమలులో పెట్టటానికి పూనుకోవాలి.

రాష్ట్ర పార్టీ నెలసరి రిపోర్టులు తీసుకొని సరిగా పని జరిగేటట్లు చూడాలి.

**నిర్మాణంలో మార్పులు**

14—25 సంవత్సరముల లోపు వారినే యువజన సభ్యులుగా తీసుకోవాలి.

రాష్ట్రము మొత్తముమీద పనినంతా సాగించటానికి కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావును నియమించడమైనది. వీరు ప్రతి జిల్లాలోను ఒక్కొక్క వ్యక్తిని ఈ పనికి ప్రత్యేకించునట్లు చూడవలయును.

(10 వ పేజీ తరువాయి)

(6) రైతుయొక్క బీదతనానికి ప్రభుత్వం హెచ్చు వడ్డీలు, వుద్యోగస్థుల లంచగొండితనమే కారణమని కూలీలకిచ్చే జీతాలుకాదని నచ్చచెప్పాలి.

**కూలీలలో పనిచేయువారు గమనించ వలసిన విషయాలు.**

(1) ప్రతి గ్రామంలో మొదటిసారి సాధ్యమైనంతవరకు రైతు, కూలీల నాయకుల సమావేశం జరపపాలి.

(2) రైతు పాటలు కూడ పాడాలి.

(3) రైతులు, కూలీలు కలియుటకు వీలుగాయుండే వుమ్మడి స్థలంలో సభలు పెట్టాలి.

(4) స్థానిక కాంగ్రెసు సంఘంలో ముఖ్యముగా రైతు సంఘములో పనిచేయు వారి యొక్క సహాయం తీసుకోవాలి.

(5) మొదటిలోనే ప్రధానంగా ఆర్థిక సమస్యలను తీసుకొనకూడదు.

(6) తగాదాలు వచ్చినప్పుడు రైతు పెద్దలు, కూలీల పెద్దలు కలసి పరిష్కారం చేసుకోవాలి.

(7) కూలీలకు సంబంధించిన ఈ క్రింది విషయముల గూర్చి పనిని ఆరంభించాలి.

**కార్యవిధానము**

పిచ్చకుంచాలు, వెట్టి చాకిరీలు, బూతుల తిట్టుట, కొట్టుట, చేయొందిన ధాన్యము, నాటువిధానము, సాంఘిక అసౌకర్యాలు, లంచగొండి తనము, పన్నులు, బంజరు భూములు, హెచ్చువడ్డీలు, వయోజన విద్యకు హక్కు, ఒంట్రాక్టులు, వ్యవసాయ కూలీ పిల్లలందరికి, కులవిచక్షణ లేకుండ వుచిత విద్య, ఆటపీ హక్కులు, త్రాగుడు, తిప్పుకొను హక్కు, యిండ్ల స్థలములు, ఋణములు, ప్రభుత్వమునుండి నిరుద్యోగ భృతి, పాలేళ్ళ ఇబ్బందులు.

# ప్రపంచ శాంతియే రష్యాకు పరమావధి

## వివిధ పీడిత దేశాలకు రష్యా చేసే సహాయం

శ్రీ కంభంపాటి సత్యనారాయణ, ఎం. ఏ.

ఇరువై సంవత్సరాలకు పూర్వమే రష్యా కార్మిక కర్షకులు ప్రపంచ శాంతి తమ ఆదర్శమని ప్రకటించారు. 1917 లో విప్లవం జరిగిన తరువాత కొత్త ప్రభుత్వం ప్రపంచ యుద్ధాన్ని ఆపుచేయుటకు ఎంతో ప్రయత్నించింది. ఆయుద్ధంలో పాల్గొంటూన్న వివిధ దేశ ప్రభుత్వాలు యెట్లాగైనా రాజీపడి, ప్రజలకు శాంతి భిక్ష ప్రసాదించవలసినదిగా రష్యా ప్రభుత్వం కోరింది. కాని, సామ్రాజ్య తృష్ణచే మైమరచిన ప్రభుత్వాలు అందు కంగీకరించలేదు. అయినప్పటికి, రష్యా దేశమొక్కటి యుద్ధ రాక్షసి చేతుల్లోనుంచి బయటపడ గలిగింది. సామ్రాజ్యవాదులచే ప్రారంభించబడిన యుద్ధములనుండి ప్రజలేవిధంగా రక్షించుకోవాలో రష్యా కార్మిక కర్షకులు మొట్ట మొదటిసారి ప్రత్యక్షంగా చూప గలిగారు.

కాని, రష్యా ప్రజలు కొత్తగా సంపాదించుకున్న శాంతిని వెంటనే అనుభవించ లేకపోయారు. ఓడించబడిన జమీందార్లు, సంస్థానాధీశ్వరులు, షావుకార్లు తిరుగుబాట్లు లేవదీశారు. ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్సు మొదలైన దేశాల నుండి పెద్ద పెద్ద సైన్యాలను రష్యాలో దింపారు. పెద్ద అంతర్యుద్ధం ప్రారంభమయింది. నాలుగైదు సంవత్సరాలు రష్యా ప్రజలు యీ విదేశ దోపిడిగాండ్రతో హోరా హోరీగా యుద్ధం చేయవలసి వచ్చింది. 1921 లో మాత్రమే శాంతి చేకూరింది.

విదేశ సైన్యాలను రష్యా సరిహద్దుల నుంచి తరిమివేసిన తరువాత, రష్యా ప్రభుత్వం వివిధ సామ్రాజ్యవాద ప్రభుత్వాలతో సంధులు చేసుకొని తన ఆర్థిక రాజకీయ సమస్యలను పరిష్కరించుకొనుటకు పూనుకొంది. కాని, సామ్రాజ్యవాద దేశాలు రష్యా ప్రభుత్వంతో స్నేహభావాన్ని పెంపొందింప చేసుకోలేదు. అమెరికా, ఇంగ్లండు మొదలైన దేశాలు రష్యా ప్రభుత్వాన్ని గుర్తించుటకు ఎన్నో సంవత్సరాలు పట్టింది. అనేకమంది సోవియట్ రాయబారులు వివిధ దేశాలలో చంపబడ్డారు. అనేక సోవియట్ భవనములు నాశనం చేయబడ్డాయి. తూర్పు చైనా రైలుదారి అనేక పర్యాయములు ముట్టడించబడింది. సోవియట్ ప్రభుత్వం యితర దేశాలను ఆక్రమించుకో బోతున్నదని అనేకఅసత్య ప్రచారాలు బయలుదేరాయి. ఇంకా ఎన్నో విధాలుగా విదేశ ప్రభుత్వాలు రష్యాపై కయ్యానికి కాలు దువ్వడం ప్రారంభించాయి. రష్యాకు-యితర దేశాలకు మధ్యగల స్నేహ సంబంధాలను చెడగొట్టటానికి ప్రయత్నించాయి. కాని, రష్యా ప్రభుత్వం ప్రపంచ శాంతికి భంగం వాటిల్లకుండా వాటి అన్నిటిని ఎంతో ఓపికతో సహించింది. క్రమక్రమంగా యీ కుట్రలు, యీ ప్రయత్నాలు, నిష్ఫలమయాయి. నేడు, రష్యా ప్రపంచశాంతిని కాపాడుటలో ఎంత యెక్కువ భారాన్ని వహిస్తూందో అనేక దేశాల ప్రజలు గ్రహించ గలుగుతున్నారు.

1933 లో హిట్లరు జర్మనీలో నాజీ పరిపాలన ప్రారంభించాడు.

ప్రపంచ యుద్ధంలో తన దేశానికి అన్యాయం, అపకారం జరిగిందని తందనాలు తొక్కటం ప్రారంభించాడు. తనకు కూడా యితర దేశాలను దోచుకోవటానికి హక్కు ఉండాలని చిందులు తొక్క నారంభించాడు. యుద్ధమే తన పరమావధిగా బహిరంగ ప్రకటన చేశాడు. జపాన్ కూడా చైనాను కబళించడానికి పూనుకుంది. మంచూరియాను ఆక్రమించుకొని, అక్కడనుంచి యితర రాష్ట్రాల పై దృష్టులు నిగుడిస్తూంది. నానా జాతి సమితిలో సభ్యులుగా ఉండడంవల్ల తమ ఆశయాలకు భంగం వస్తుందని యీ రెండు దేశాలు అనుమతించి విడిపోయాయి. ముసోలినీకూడా పేరుకు మాత్రమే సభ్యత్వాన్ని కలిగియున్నాడు.

రష్యా యిది చూచింది. జర్మనీ, ఇటలీ జపాన్ దేశాలు ప్రపంచ శాంతికి భంగం కలుగజేయగలవని గ్రహించింది. గ్రహించి వెంటనే నానా జాతి సమితిలో చేరింది.



కామ్రేడ్ స్టాలిన్

ప్రపంచ శాంతి స్థాపనకు నానా జాతి సమితిని ఒక సాధనంగా ఉపయోగించు కొనసాగింది. శాంతిని కోరే శక్తు లన్నిటిని ఒకచోట కేంద్రీకరించ సాగింది.

ఫాసిజం అంటే యుద్ధం—సోషలిజం అంటే శాంతి. ఈ వాక్యంలో ఎంత అర్థమున్నదో నేడు అందరూ గ్రహిస్తున్నారు.

అబిసీనియా యొక్క ఆక్రమణకు ఇటాలియన్ ఫాసిజం కారణం. స్పెయిన్‌లో జరుగుతూన్న తిరుగుబాటుకు జర్మనీ ఇటలీ ఫేసిస్టు ప్రభుత్వాలు కారణం. చైనాను నేడు ఆక్రమించుకొనుటకు జపాను ఫేసిస్టు ప్రభుత్వం కారణం. జర్మనీ—జపాన్—ఇటలీ రాజ్యాలు మూడూఏకమై ప్రపంచాన్ని ఏ విధంగా ధ్వంసం చేస్తున్నాయో వివరించ నవసరం లేదు.

కాని, రష్యా మాత్రం ప్రపంచశాంతిని కాపాడ్డానికి విశ్వ ప్రయత్నాలు చేస్తోంది. అనేక రాజ్యాలతో, యుద్ధ ప్రతికూలపు టొడంబడికలు (non-aggression pacts) చేసుకొంది. ఫ్రాన్సు, జెకోస్లొవేకియాలతో అన్యోన్య సహకారపు టొడంబడికలు (mutual assistance pacts) చేసుకొంది. జపాన్ మంచూరియాను; ఇటలీ అబిసీనియాను; ఇటలీ జర్మనీలు స్పెయిన్‌ను: నేడు జపాన్ చైనాను ఆక్రమించు కొన్నప్పుడు రష్యా పీడిత రాజ్యాల తరపున వాదించింది. ఫేసిస్టు రాజ్యాల దౌర్జన్యాన్ని ఖండించింది. జనీవా నానా జాతి సమితిలోను, నయొన్సు లండన్ సమావేశాలలోను రష్యా ప్రతినిధి పీడిత రాజ్యాలను సమర్థిస్తూ ఉపన్యసించాడు.

రష్యాకు యుద్ధం అవసరం లేదు. ఎందువల్ల నంటే, రష్యాలో సోషలిస్టు ప్రభుత్వం ఉన్నది కాబట్టి; సోషలిస్టు ప్రభుత్వం యితర దేశ ప్రజలను దోచుకో నవసరం లేదు కాబట్టి. మానవులు తోడి మానవులను దోచుకొనే విధానం నిర్మూలించబడిన దేశంలో ఒక దేశము మరొక దేశాన్ని దోచుకోవాలనే కాంక్ష ఉండడం అసంభవం.

కాని, రష్యా యితర దేశాలలో సోషలిస్టు విప్లవాలను పురిగొల్పి, ఆ విధంగానైనా ప్రపంచ శాంతికి భంగము వాటిల్లేటట్లు చేయటం లేదా అని కొంద రడుగుచున్నారు. దానికి స్టాలిన్ చక్కని సమాధాన మిచ్చాడు;

"రష్యాకు ప్రక్కనున్న రాజ్యాలలో సామాజిక వ్యవస్థ మారవలెనని తప్పకుండా సోవియట్ ప్రజలు ఆశిస్తున్నారు. కాని, మార్పులను తేవలసినవారు ఆప్రక్క రాజ్యాలవారే. ....విప్లవాన్ని ఎగుమతి చేయడమనేది వట్టి అర్థరహితమైన మాట." అని స్టాలిన్ చెప్పాడు.

నిజమే. ఒక్కొక్క దేశంలో విప్లవం ఎప్పుడు రావాలో, దాన్ని నడిపే వారెవరో, ఆవిప్లవం యొక్క స్వభావమెట్టిదో - యివన్నీ నిర్ణయించేది ఆయా దేశాలయందలి విప్లవనాయకులు. అంతేగాని, రష్యాలోని సోవియట్ ప్రభుత్వం కాదు. స్టాలిన్ అసలేకాదు.

ప్రపంచ శాంతిని కాపాడ్డం రష్యా కొత్తగా అనుసరిస్తూన్న ఎత్తుగడ కాదు. రష్యాలో సోషలిజం చిరస్థాయిగా ఉండాలంటే, ప్రపంచ మంతటిలోను శాంతి స్థాపించబడాలి. ఈవిషయంలో రష్యా



పెట్టుబడిదారీ దేశముల యందలి అసంఖ్యాకులైన కార్మిక కర్షకుల కోరికలను ప్రతిబింబిస్తూంది. చిన్న రాజ్యాలయొక్క హక్కులూ, రష్యాయొక్క హక్కులూ ఒకటే. ఫేసిస్టు రాజ్యాలు చిన్నరాజ్యాల స్వేచ్ఛకు ఏవిధంగా అడ్డు తగులతున్నాయో, రష్యాకుకూడా అదేవిధంగా అడ్డు తగులుతున్నాయి. కాబట్టి, చిన్నరాజ్యాల తరపున రష్యా ప్రపంచ శాంతికొరకు పోరాడుతోంది.

అంతేకాదు. బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా వంటి పెద్ద ప్రజా ప్రభుత్వాలకు కూడా ఫేసిజం నాశనకారి. కారణం ఏమనగా, ఫేసిజం పరిపాలనకు దిగితే జర్మనీ — ఇటలీలలోవలె ప్రజలకు సామాన్య పౌరసత్వ హక్కులు కూడా లేకుండా పోతాయి. నిరంకుశత్వం నిర్భయంగా తాండవ మాడుతుంది. కనుకనే రష్యా, ప్రజాస్వామిక ప్రభుత్వాలన్నిటి యొక్కయు సహకారం పొందుటకు ప్రయత్నిస్తోంది.

రష్యా యొక్క యీ ప్రయత్నాలు సఫలమయితే, తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కూడా కాపాడబడతాయని చిన్న రాజ్యాలన్నీ గ్రహించాయి. ఎందువల్ల నంటే, రష్యాలో విప్లవం జరిగిన మరునాడే అనేక అస్వతంత్రంగానున్న రాజ్యాలకు సంపూర్ణ స్వాతంత్రం ఈయబడింది. నేడు సోవియట్ యూనియన్‌లో 11 వివిధ రాజ్యాలు చేర్చబడి యున్నాయి. ఏ నిమిషములోనైనా విడిపోవడానికి వీటికి స్వాతంత్ర్యం ఉంది. ఇట్లే మంగోలియన్ రిపబ్లికుకు తూవా రిపబ్లిక్కులకు సంపూర్ణమైన స్వపరిపాలన గలదు. వీటిపై జపాన్ యీ 20 సం॥ నుంచీ దండెత్తకుండా ఉండుటకు కారణం రష్యాయే. అని చెప్పవచ్చును. ఈ వివిధ రాజ్యాలలో దేనిపై మరొక ప్రభుత్వము దండెత్తి వచ్చినప్పటికీ, కేంద్ర ప్రభుత్వం వెంటనే వచ్చి రక్షిస్తుంది, మరొక విషయం, విప్లవానికి పూర్వం, రష్యా చక్రవర్తి చైనాలో కొన్ని ప్రత్యేకాధికారాలను సంపాదించాడు. విప్లవం రాగానే ఆ ప్రత్యేకధికారాలను విప్లవ ప్రభుత్వం రద్దు చేసుకుంది. ఈ విధంగా చైనా ప్రజల సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని గుర్తించింది. ఇంతేగాక, పూర్వపు రష్యాలో ఒక భాగముగా ఉండే ఫిన్‌లాండు, ఇస్థోనియా, లిధూనియా, లాట్వియా, పోలెండు అనే 5 రాజ్యాలు స్వతంత్రంగా బయట ఉండుటకు రష్యా అంగీకరించెను. ఈ 5 రాజ్యాలలోనే 1916 తరువాత విప్లవ విరోధులు జయపతాకాన్ని ప్రతిష్ఠించారు. ఈ 5 రాజ్యాలలో నుండియే పెద్ద పెద్ద విదేశ సైన్యాలు రష్యాపై దండెత్తి వచ్చాయి. 1931 వరకూ ప్రజలపై అనేక చిత్రవధలు చేశాయి. అయినప్పటికి, జర్మనీతో సంధి చేసుకొని యుద్ధాన్ని ఆపివేయడానికి ఈ 6 రాజ్యాలునూ రష్యా కోల్పోయింది. వాటి స్వాతంత్రాన్ని గుర్తించింది.

ఐరోపాలో ఇంకా ఎన్నో చిన్న రాజ్యాలున్నాయి. అబిసీనియాకు, స్పెయినుకు, చైనాకు పట్టినగతి రేపు తమకు కూడా పట్టవచ్చునని వారికి భయం. లిధూనియా మొదలైన రాజ్యాలలో సోషలిస్టు ప్రతికూల ప్రభుత్వాలే ఉన్నప్పటికీ ఆదేశ ప్రజలు హిట్లర్ నోటిలో పడకుండా ఉండాలంటే, రష్యాయొక్క అండను చేరాలి. రష్యాయొక్క శాంతి ప్రయత్నాలతో ఏకీభవించాలి. జకోస్లోవేకియా నేడు ఇంత ధైర్యంగా జర్మనీకి సమాధానం చెబుతోన్నదంటే, రష్యాయే కారణం, ఇదేవిధంగా రుమేనియా, బల్గేరియా, మొదలైన డాన్యూబియన్ రాజ్యాలు రష్యాయొక్క విధానాన్ని అంగీకరిస్తున్నాయి. ఒకవైపు హిట్లర్, ముసోలినీలు యీచిన్న రాజ్యాలను పంచుకోవడానికి అనేక కుట్రలు పన్నుతున్నారు. అనేక లంచాలు ఇస్తున్నారు. అనేక వాదులు సల్పుతున్నారు, మరొకవైపు ఆరాజ్యాల ప్రజలు రష్యాను తమ స్వాతంత్రాన్ని కాపాడే ఒక కోటగా భావిస్తున్నారు.

నేడు స్పెయిన్‌నూ, చైనానూ, ఇటలీ జర్మనీ, జపాన్‌లు కబళించివేయటానికి చూస్తున్నాయి. ఈ దౌర్జన్యాన్ని ఎట్లాఅయినా ప్రతిఘటించటమే రష్యాయొక్క సమస్య. రష్యాయొక్క శాంతి ప్రయత్నాలన్నీ నేడు దీనిపై కేంద్రీకరింపబడి ఉన్నాయి. ప్రపంచమందలి యుద్ధ వ్యతిరేకులందరు ఏకమై ఫేసిస్టు దుండగీడుల దౌర్జన్యాన్ని అరికట్టుటకు నిర్దిష్టమైన కార్యక్రమానికి పూనుకోవడమే నేటి సమస్య. ఇందుకే రష్యా నేడు తీవ్రప్రయత్నాలు చేస్తోంది. ఈ విధమైన ఐక్యసంఘటనలే ప్రపంచ శాంతిని కాపాడగలవు. స్పెయిన్, చైనా దేశాలలో ఫేసిస్టులు జయం పొందితే, ఆరెండు దేశాలను ఆధారంగా తీసుకొని ప్రపంచ మందలి యితర దేశాలను కూడా మింగుతారు. ఓడిపోతే, ప్రపంచ శాంతి కాపాడబడుతుంది.

ప్రపంచ యుద్ధం రాకుండా ఆపుటకు అనుకూలమైన పరిస్థితులు నేడు ఎన్నో ఉన్నాయి, కాని, ఇంగ్లండువంటి ప్రజాతంత్ర రాజ్యాలలో ఫేసిస్టుల ఏజంట్లు ఇప్పటివరకూ తమ కనుకూలంగానే బ్రిటిషు ప్రభుత్వాన్ని లొంగదీసు కొంటున్నారు. వివిధ యుద్ధ ప్రతికూల శక్తులు ఏకమై ఫేసిస్టుల రక్తపిపాసను అరికట్టడంలో చేస్తూన్న ప్రయత్నాలను వీరు భగ్నం చేస్తున్నారు.

ఈ ప్రమాదము నుండి ప్రపంచాన్ని కాపాడాలంటే, ఒక్క రష్యా ప్రభుత్వపు యుద్ధ ప్రతికూల విధానం చాలదు. ప్రపంచ మందలి శాంతి కాములందరు, ప్రజాసామాన్య మంతా తక్షణమే కలుగజేసుకోవాలి. ముఖ్యంగా, ప్రపంచ కార్మికులు కలుగజేసుకోవాలి. వివిధ దేశాలలోని లేబర్ పార్టీలు, సోషలిస్టు పార్టీలు, కమ్యూనిస్టు పార్టీలు, ట్రేడ్ యూనియన్లు ఫేసిస్టు పెనుభూతాలను స్పెయిన్, చైనాలనుండి తరుముటకు ఒక ఐక్య సంఘటనగా చేరాలి. బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన ప్రజాతంత్ర రాజ్యాలకు శక్తివుంది కాని, ఆ ప్రభుత్వాలు ఫేసిస్టులకు ప్రతికూలంగా పోరాడేటట్లు ప్రజాసామాన్యం బలమైన ఒత్తిడిని కలుగజేయాలి. అంతా అయాక ఆకాశం వైపు చూస్తే లాభం ఉండదు. వెలుతురు ఉండగానే యిల్లు చక్కబెట్టుకోవాలి. ఫేసిస్టులు యిప్పటికి మూడు ఖండాల్లో యుద్ధజ్వాలలను రగుల్కొలిపారు. త్వరలో వారిని అణచక పోయినచో, ప్రపంచ మంతటికీ యీ జ్వాలలు వ్యాపిస్తాయి. ఈ ముప్పు వాటిల్లకుండా రష్యా తన శక్తిలో ఉన్నదంతా చేసింది, చేస్తూంది. కాని, ప్రతి క్షణమూ రష్యా ఎట్టి అపాయానికైనా సిద్ధంగా ఉంది. 1934లో సోవియట్ యూనియన్‌యొక్క కమ్యూనిస్టుపార్టీ సమావేశంలో స్టాలిన్ యీ విధంగా చెప్పాడు.

"మన విదేశ రాజ్యాంగనీతి స్పష్టంగా ఉంది. శాంతిని కాపాడ్డం—అన్ని దేశాలతోను వ్యాపార సంబంధాలను బలపరచుకోవడం—ఇది దాని సారాంశం, మన ప్రభుత్వం యితర దేశాలను ఆక్రమించుకొనుటకుగాని, బెదరించుటకుగాని ప్రయత్నించదు. ప్రపంచ శాంతియే మన ఆదర్శం. దానిని మనం రక్షిస్తాం. కాని, ఇతరుల బెదరింపులను చూచి మనం భయపడువారం కాము. యుద్ధాన్ని ప్రోత్సహించే వారియెడల దెబ్బకుదెబ్బ అనేనీతిని అవలంబిస్తాం. ప్రపంచ శాంతి కావలసినవారు, మనతో వ్యాపార సంబంధాలను పెంపొందింప జేసుకొన గోరేవారు తప్పక మన సహాయం పొందగలరు. కాని, మన దేశాన్ని కబళించటానికి ప్రయత్నించే వారికి మాత్రం ఇక ఎప్పుడూ మరచిపోని విధంగా సమాధానం చెప్పి పంపుతాం. సస్యశ్యామలమైన రష్యాపై మరొకసారి దృష్టులు నిగుడ్చకుండా తగిన నీతిని గుణపాఠం నేర్పుతాం!"



యుద్ధాలను రేపి శాంతికి ముప్పుతెచ్చే ఫేసిస్టు నాయకుడు హిట్లర్

## రైతు వుద్యమ ఆశయం

(9 వ పేజీ తరువాయి)

మును నిర్మూలించుట (5) జమీందారీ ప్రదేశాలలో జరుగు అన్యాయములను, దౌర్జన్యములను ఆపుటకు ఆందోళన (6) పరపతి సౌకర్యములను కలుగజేయుటకు ఆందోళన (7) రైతు సమావేశాలు (Rallies) తరచుగా ఏర్పాటుచేసి వాటిలో కాంగ్రెసు సంఘములు కూడ పాల్గొనునట్లు చేయుట (8) కౌలుదార్ల హక్కులను కాపాడుట.

పార్టీ పత్రికనుండి, పార్టీనుండి సహాయం.

వివిధ ప్రాంతాలలో జరిగిన విషయములు సమగ్రముగా వ్రాస్తూ అయా పరిస్థితులలో ఏవిధముగ నడచుకోవలెనో సూచించుట.

రైతు వర్కర్లకు, వివిధ పరిస్థితులలో ఏయేవిధముగ నడచుకోవలెనో సూచించుట.

శాసన సభలచే చేయబడిన చట్టములనుగురించి ప్రభుత్వముచేయు ఇతర పనులనుగురించి ప్రజాసామాన్యము చేయవలసిన పనులను, వెల్లడించ వలెను.

కాంగ్రెసు ఎన్నికల ప్రణాళిక, ఫైజపూర్ తీర్మానముల ప్రకారం, కాంగ్రెసు మంత్రివర్గం శాసన సభలు, ఏయేచర్యలు తీసుకోవలెనో అందువిషయమై ప్రజలేమి చేయవలెనో వ్రాయ వలెను.

వివిధ రాష్ట్రలలో ప్రభుత్వములు రైతులకెట్టి సౌకర్యములు కలిగించినవో తెలియజేస్తూ చెయ్యని రాష్ట్రములలో ప్రజలు ఎట్టి ఆందోళన చేయవలెనో వెల్లడించ వలెను.

వివిధ రాష్ట్రములలోని రైతు ఉద్యమమును గురించి వ్యాసములు వ్రాయవలెను.

రైతు ఉద్యమము, జాతీ యైక్యసంఘటనను ఎట్లు బలపర్చవలెనో వ్రాయవలెను.

రైతు పోరాటములు బయలుదేరినప్పుడు ఆందోళన ఎట్లు చేయవలెనో వ్రాయవలెను.

సోవియట్‌యూనియన్‌లోవ్యవసాయవృత్తి ఎట్లు అభివృద్ధియగు చున్నదీ, వ్యాసాలు వ్రాస్తూ వుండాలి.

* ఇట్టి పరిస్థితులు ప్రజాసామాన్యంలో కాంగ్రెసు పలుకుబడిని భగ్నం చేయుటకై జమీందార్లు ప్రజలపై నిర్బంధాలను అధికము చేయుటచే ఏర్పడినవి. ఈ విషయములో రైతుసంఘములు వెంటనే తగు నిర్ణయమునకు వచ్చి తగుచర్య తీసుకోవలెను.

రైతులోకం

# ఆంధ్ర రాష్ట్రంలో జమీందారుల దౌర్జన్యాలు

## ఆంధ్ర రాష్ట్రం

### మునగాల రైతుల డిప్యుటేషను.

కృష్ణాజిల్లా మునగాల యెస్టేటు రైతులు తమ యిక్కట్లను గురించి చేస్తున్న ఆందోళనను తెలుసుకొని, కృష్ణాజిల్లా కలెక్టరు గారు యీనెల 6 వ తేదీని మునగాల క్యాంపు చేశారు. ప. కృ. జిల్లా కాంగ్రెసు కమిటీవారి తీవ్ర కృషివల్ల, అనేక మంది చుట్టు పక్కల గ్రామస్థులు ఆరోజున డిప్యుటేషన్ తీసుకొని వెళ్ళారు. రైతులు అనేక స్టేటుమెంట్లను, వాటిని యిజువు పరచుటకు రికార్డులను కలెక్టరు గారి కిచ్చిరి. ఎస్టేటి రైతుల పక్షాన్ని మునగాల జమీన్ రైతు సంఘముచే మెమోరాండం కూడా ఈయ బడెను. అనేక మంది ప్రజలు కలెక్టరుగారి సమక్షానికి వచ్చి తమ తమ యిబ్బందులను చెప్పుకున్నారు. వెట్టి చాకరిని గురించి; జరిమానాలను గురించి; దెబ్బలు కొట్టుటను గురించి; ఆంక్షలను గురించి, తగాదాల పరిష్కారమున నజరానాలు వసూలు చేయుటను గురించి; స్వంత బావుల క్రింది సాగులకు వల్లపు శిస్తుల వసూలు చేయుటను గురించి; సివిల్ క్రిమినల్ చర్యలను గురించి; ఎస్టేటు ఉద్యోగస్థులకును ప్రభుత్వోద్యోగులకును వర్తకులచేత చితముగా సరకులు సప్లయి చేయించుకొనుటను గురించి; సర్వీస్ ఈనాములను స్వాధీన పరచుకొనుటను గురించి — ప్రజలు చెప్పుకొన్నారు. ఒక కోమటి, ఒక మాదిగ, ఒక కుమ్మరి తమ్ము జమీందారు కొట్టిన దెబ్బలను చూపారు. ఒక షాహుకారు తనకు సంక్రమించిన ఆస్తిని జమీందారు యేవిధంగా వశపరచుకొని ఎట్లు అన్యాయంగా వేలంవేసు కొన్నాడో వివరించెను. వేలంలో కొన్న వ్యక్తి వచ్చి నిజమేనని చెప్పాడు.

కలెక్టరు గారు అంతయువిని, రైతులను శాంతంగా ఉండమని హెచ్చరించిరి. తాను వారి యిబ్బందులను సాధ్యమైనంత వరకు నివారించెదనని వాగ్దానం చేశారు.

### మొఖాసాదార్ల దౌర్జన్యం.

పశ్చిమ గోదావరిజిల్లా చింతలపూడి తాలూకా గుంటపల్లి ముఠా మొఖాసాదారు అడవిలోకి రైతుల పశువులు వచ్చినట్లయితే బందిలి దొడ్లో పెట్టిస్తున్నారు. అంతేగాక, రైతుల పశువులకు మేతలేకుండా చేయుటకై జమీందారు పొలానికి వెంట కట్టుతూన్న గొర్రెలను రైతుల పొలాలమీదికి తోలుతున్నారు. నౌకర్లు, గొర్రెలను నిరోధించిన మొక్కపాటి శ్రీరాములు గారిని కర్రలలో పదిమందీ పదిదెబ్బలు కొట్టి వెళ్ళిపోయారు. ఆయన జమీందారీ విచారణ సంఘము యెదుట సాక్ష్యం యిచ్చారు. 29-6-38 వ తేదీని కొల్లి ధర్మయ్య అనే రైతు (పంతమనేని వారి గూడెం) నాగళ్లు కట్టుకొనుటకు ఎడ్లను బయలుదేరగొట్టుటకు వెళ్ళగా, సుమారు 50 మంది తుంటరులలో మొఖాసాదారు కుమారుడు, మేనల్లుడు వచ్చి, కొల్లి ధర్మయ్యను స్పృహతప్పి పడిపోయేటట్లు కొట్టి వెళ్ళిపోయారు. ఇది జరిగిన రెండు మూడు గంటలకు సుమారు 150 మంది మనుష్యులు కర్రలు, కత్తులు ధరించి, రైతులపై దౌర్జన్యము చేయ తలపెట్టారు కాని రైతులు భయభ్రాంతులై ప్రాణములను దక్కించుకొన్నారు. ఈ దౌర్జన్యాలన్నీ రైతులను బెదరించి, వారిని భూములనుండి తరుముటకే మొఖాసాదారు యొక్క ప్రయత్నమని ప. గో. జిల్లా రైతుసంఘ కార్యదర్శి తెలుపుచున్నాడు.

కృష్ణాజిల్లా చిట్టేల గ్రామంలో జమీందారుల దౌర్జన్యానికి గురియైన

శ్రీ కొల్లి బుచ్చయ్యగారు

### మదరాసు,

రాజధాని యందలి వివిధ జిల్లాలలో, నీటి పారుదల కొరకై ఈ సంవత్సరం రు. 4,68,000 లు మదరాసు ప్రభుత్వం శాంక్షన్ చేసింది. ఒక్కొక్క జిల్లలో యేవిధంగా యీధనాన్ని వినియోగ పరచాలో ఆయా జిల్లా కలక్టర్లు నిర్ణయిస్తారు.

## సంయుక్త పరగణాలు

ఈమధ్య సమావేశమైన రాష్ట్ర కాంగ్రెసు కమిటీలో, రైతులకు సంబంధించిన సమస్యలు చర్చకు వచ్చాయి. సంయుక్త పరగణాలలో జమీందారీ విధానమేగాని, రైతువారీ విధానంలేదు. ప్రభుత్వానికి పన్ను సాలీనా జమీందార్లు చెల్లించాలి. రైతులు యీ జమీందార్లకు శిస్తు చెల్లించాలి. ప్రతి సంవత్సరం రాష్ట్రం మొత్తంమీద సుమారు రు 20 కోట్లు జమీందార్లు రైతులవద్ద వసూలు చేసుకొంటున్నారు. కాని, వారు గవర్నమెంటుకు చెల్లించవలసిన పన్ను మాత్రం సుమారు 6 కోట్లు. యం. యన్. రాయిగారు కమిటీలో ఒక తీర్మానాన్ని ఉపపాదించారు. దానిప్రకారం, రైతులు జమీందార్లకు చెల్లించవలసిన శిస్తు సగానికి తగ్గించాలి. ఈవిధంగా తగ్గిస్తే గవర్నమెంటుకు ఏమీ నష్టంరాదు. జమీందార్లకు సుమారు 4 కోట్లు ఆదాయం వస్తుంది. రాయిగారి యీ తీర్మానం కమిటీవారిచే అంగీకరింపబడింది.

1944 వ ఫసిలీకి పూర్వం రైతులు జమీందార్ల కీయవలసిన బకాయిలన్నిటిని రద్దు చేయవలసినదిగా మంత్రివర్గం వారిని కోరుతూ మరొక తీర్మానం ఆమోదించబడింది. జమీందార్లు రైతులపై జరుపుతూన్న దౌర్జన్యాలను ఎదుర్కొవడానికి చర్య తీసుకోవడానికి రాష్ట్ర కాంగ్రెసు కార్య కమిటీకి అధికారం యిస్తూ మరొక తీర్మానం చేయబడింది.

### భూర్ సత్యాగ్రహం

డెహ్రాడూన్‌కు 30 మైళ్ళ దూరంలోఉన్న భూర్ గ్రామములో రైతులు సత్యాగ్రహ సన్నాహంలో ఉన్నారు. వీరు కంటోన్మెంటు అధికారులవద్ద భూములను మగతాకు తీసుకొని దున్నుతున్నారు. కాని, వారిని భూములనుండి వెళ్ళగొట్టుటకు యీమధ్య కంటోన్మెంటు అధికారులు ప్రయత్నించారు. కాని, రైతులు అనేక సంవత్సరాలనుంచి దున్నుతున్న భూములను విడిచి వెళ్ళడానికి నిరాకరిస్తున్నారు.

కంటోన్మెంటు అధికారులు తమ పట్టు విడువకపోతే రైతులు పన్నుల నిరాకరణకు తయారుగాఉన్నారు. మంత్రులను కాంగ్రెసు నాయకులను యీ సమస్య కలవరపెడుతోంది.

### ఉనావో

ఇదే విధంగా ఉనావో జిల్లాలో కూడా అనేకమంది రైతులు తమ భూములనుండి తొలగించ బడుతున్నారు. జమీందార్లు తమ భూములను రైతులవద్ద లాక్కొని, సొంతకమతంలో కలుపుకొంటున్నారు. రైతులు దీనిని ప్రతిఘటిస్తున్నారు త్వరలో పన్నుల నిరాకరణోద్యమాన్ని లేవదీయుటను గురించి ఆలోచించుటకు జిల్లా కాంగ్రెసు కమిటీ యొక్క ప్రత్యేక సమావేశం జరుగుతోంది.

### టెనెన్సీ బిల్లు

టెనెన్సీ బిల్లు త్వరలో శాసనసభకు చర్చకు రానున్నది. కాంగ్రెసు వారే అక్కడ అధిక సంఖ్యాకులు కాబట్టి సులభంగా నెగ్గుతుంది. కాని, పై శాసనసభలో కూడా అది నెగ్గాలి. అప్పుడే శాసనం అవుతుంది. కాని, పై శాసనసభలో కాంగ్రెసు వారికి మెజారిటీలేదు. కాబట్టి అది అక్కడ ఓడిపోక తప్పదు. ఇట్టి స్థితి యేర్పడి నప్పుడు, చట్టం ప్రకారం రెండు శాసన సభలు ఒక సంవత్సరమయాక సమావేశమై బిల్లును చర్చించాలి. కాని, సంవత్సరం వరకూ నిరీక్షించి ఉంటే రైతులకు జరుగ వలసిన ఉపకారం జరుగదు. కాబట్టి, కాంగ్రెసు వారు ఒక ఆలోచన చేస్తున్నారు. ఆర్థిక బిల్లులైతే, సంవత్సరం వరకూ వేచియుండక, తక్షణం రెండు శాసన సభలనూ సమావేశ పరచవచ్చును. కాబట్టి యీ బిల్లునకు ఆర్థిక లక్షణాలు ఉండేటట్లు చేస్తున్నారు. ఉదా. బిల్లు చివర పన్నులకు సంబంధించిన క్లాజు ఒకటి చేర్చబోతున్నారు. దాని ప్రకారం, రైతులకు—భూస్వాములకు వచ్చే సంవత్సరాదాయమును బట్టి పన్ను విధించబడును.

## బీహార్

టెనెన్సీ బిల్లుపై ఎన్నో నెలలనుంచి జమీందార్లకు-కాంగ్రెసు వారికి మధ్య వాద ప్రతివాదాలు జరుగుతున్నాయి. ఆఖరికి, అబుల్ కలాం అజద్ గారి మధ్యవర్తిత్వం వల్ల రాజీ కుదిరింది. త్వరలో బిల్లు చర్చకు వస్తుంది. రాజీ షరతులేమనగా,

రైతు జమీందారున కీయవలసిన శిస్తు వరుసగా 4 సంవత్సరాలు చెల్లించక పోతే, ఆ రైతు బాకీ ఉన్న శిస్తుకు సరిపోవు భూమిని అమ్మి బాకీని వసూలు చేసుకొనే అధికారం జమీందారునకుంటుంది. కాని, యిది జరిగిన తరువాత, 5వ సంవత్సరం నుంచి శిస్తు చెల్లించడం మానివేస్తే, ఆ రైతు యొక్క యావత్తు భూమిని అమ్మివేయుటకు జమీందారున కధికారం ఉంటుంది. ఇది రైతులకు నష్టం.



# చిట్టివలసలో రెండు నెలల నుండి సమ్మె

## బెజవాడలో అచ్చు పనివారి సమ్మె

(6 వ పేజీ చివరాయి)

జరుగుతూన్న సమ్మెకు పట్టణ కాంగ్రెసు సంఘము, రాష్ట్ర కాంగ్రెసు సంఘము సహాయం చేశాయి. ధనవాన్యములు ప్రతిరోజూ వసూలుచేసి కార్మికులకు పంచిపెట్టాయి. కాంగ్రెసు కర్మికులకు సహాయపడు సంస్థ అని ప్రజలు విశ్వసించునట్లు క్రియలో చూపగలిగారు. దేశంలో ఒక వర్గం తన హక్కులకై చేయు పోరాటంలో కాంగ్రెసు యితర వర్గాల సానుభూతిని, సహాయాన్ని సంపాదించాలి. ఇదే నేడు కాంగ్రెసు కమిటీల కర్తవ్యం. సంయుక్త రాష్ట్ర కాంగ్రెసు కమిటీ యీ కర్తవ్యాన్ని నెరవేర్చింది. ఇతర రాష్ట్రాలలో కూడా యీ విధానం అవలంబిస్తే, మన స్వాతంత్ర్య పోరాటం త్వరలో సఫలమౌతుంది.

(5) హిందూ — ముస్లిం సమస్య అనేక మందికి ఎంతో పెద్ద సమస్యవలె కనబడుతూన్న యీ రోజుల్లో, నిజమైన హిందూ — ముస్లిం ఐక్యత ఎట్లు వచ్చునో కాన్పూరు చూపింది. సమ్మెకాలంలో అక్కడి ముస్లింలీగు సమ్మెదార్ల కెంతో సహాయంచేస్తూ, కార్మిక సంఘంతోను, కాంగ్రెసు కమిటీతోను చేయి చేయి కలిపి పనిచేసింది. ఇతర రాష్ట్రాలలోకూడా స్థానిక ముస్లింలీగులతో యితర సంస్థలు ఐక్యసంఘటనకు రావలెను.

(6) అన్నిటికంటె ప్రధానమైన విషయం ఏమనగా, ప్రజాఉద్యమం లేనిదే కాంగ్రెసు మంత్రులు తమ విధులను నెరవేర్చ లేరు. కాంగ్రెసు ప్రణాళికను అమలు జరుపలేరు. కాంగ్రెసు మంత్రులు అధికారంలోకి రాగానే అనేక చోట్ల కార్మికులు సమ్మెచేస్తూన్నారని చీకాకుపడరాదు: వారి సక్రమ కోరికలను నెరవేర్చుట కాంగ్రెసు కార్యక్రమంలో ఒక భాగం. అట్లు నెరవేర్చకుండా కొంతమంది యజమానులు, షావుకార్లు ప్రయత్నిస్తారు. వారి ప్రయత్నాలు నెగ్గకుండా కాంగ్రెసు తీర్మానాలను ఆచరణలో పెట్టించుటకు కార్మికులు సమ్మెచేయుట సహజం. ఇట్టి సమ్మెలను మంత్రులు శుభచిహ్నంగా తీసుకోవాలి. బాధపడ కూడదు.

## పొగాకు కార్మికులు

### చీరాల.

చీరాల దురంతాలు జరిగి చాలా రోజులయింది. ఇప్పుడు కార్మిక సంఘాన్ని యజమానులు గుర్తించేటట్టు చేయమని యజ్ఞనారాయణ గారు గిరి గారిని కోరుతున్నారు. గిరిగారి సలహాను ఫ్యాక్టరీ యజమాని ఇదివరలో ఏ విధంగా త్రోసిపుచ్చాడో పాఠకులు మరచిపోయి ఉండరు. ఆ తరువాత, కాల్పులు, ఎరస్టులు, విచారణ, హార్విల్ రిపోర్టు — యివన్నీ చీరాల కార్మికులను ఎంత నిరుత్సాహ పరిచాయో ఊహించు కోవచ్చు. ఇప్పుడు యూనియన్‌ను గుర్తించమని యజమానిని కోరితే, ఎంతవరకు సఫలమవుతుందో అనుమానమే.

## జనపనార కార్మికులు

### చిట్టివలస

చిట్టివలసలో సుమారు 2 నెలలనుంచి జనపనార కార్మికులు సమ్మె చేస్తూన్నారు. కరుణాకరం సుబ్బారావు గారును, వి. వి. నరసింహం గారును డా. పట్టాభిగారును, అక్కడికివెళ్ళి సమ్మెదార్ల స్థితిని చూచారు. ఇంతవరకూ తాను చేసిన రాజీప్రయత్నాలు విఫలమయాయనిన్నీ ఆఖరు ప్రయత్నంగా యస్. వి. రామమూర్తి ఐ. సి. యస్. గారిని చిట్టివలసకు పంపుతున్నామనిన్నీ మదరాసు ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. 2000 మంది సమ్మెదారుల విషయంలో రాజీ ప్రయత్నాలు సఫలం కాలేదంటే, కాంగ్రెసు మంత్రులు త్వరలో ఆకలిచే బాధపడుతూన్న కార్మికులకు సహాయం చేయలేకపోయారంటే, దానికి కారణం కాన్పూరులోవలె తగిన ప్రచారం లేక పోవడమేనని చెప్పాలి. ఆ జిల్లా కాంగ్రెసు కమిటీ సమ్మెదారుల విషయంలో ఇప్పటికి కంటె ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి.

## పి. డబ్ల్యు. కార్మికులు.

### మదరాసు

800 మంది వర్క్‌షాపు కార్మికులు లోపలనే ఉండి ఒకరోజు పనిచేయుట మానివేశారు. కారణం జనవరి నెలలో వారికి యిస్తామని వాగ్దానం చేసిన హెచ్చు జీతాలు మేనేజరు ఈయకపోవుటే. ఇది తుది నిర్ణయం కాదని మేనేజరు చెప్పగా, మరునాడు కార్మికులు పనులకు వెళ్ళారు.

## కిరసనాయిల్ కార్మికులు.

### రంగూన్

రంగూన్‌లోని కిరసనాయిల్ కార్మికుల సమ్మె సాగుతోంది. గవర్నమెంటుచే రాజీ సంఘం నియమించ బడింది.

## ఉక్కు పరిశ్రమ.

### హీరాపూర్

ఇక్కడ చాలా కాలంనుంచి కార్మికులు సమ్మె చేస్తున్నారు. సమ్మెలో గుమాస్తాలు కూడా చేరారు. ఇది చూచి కంపెనీ యజమాని ఒక స్టేట్‌మెంటు యిచ్చాడు. ఈ గుమాస్తాలకు, మేస్త్రీలకు నిజంగా కష్టాలేమీ లేవనియు, సోషలిస్టు భావాలలో మునిగి దూరాలోచన లేకుండా యిట్లు సమ్మెలో చేరారనియు, అసలు కార్మికులకు యీ గుమాస్తాలకు యెట్టి సంబంధము లేదనియు అతడు ప్రకటించాడు.

పోనీ, సోషలిస్టు భావాలులేని సామాన్య కార్మికులకు కష్టములున్నాయని అంగీకరిస్తున్నాడు కదా, ఆయన! అయితే, ఎందుకు వారి కనీసపు కోరికలను తీర్చి సమ్మె ముగియునట్లు చేయరాదు? అప్పుడు కంపెనీకి నష్టం వస్తుందని వాదిస్తాడేమో? నష్టం వస్తే కంపెనీని ఎత్తివేయకుండా ఉంటాడా?

## అచ్చు కార్మికులు

### మదరాసు

జూన్ 26 వ తేదీనుండి సమ్మె చేస్తూన్న 250 మంది డయొసేషియన్ ప్రెస్ కార్మికులు సమ్మెను ముగించారు. తొలగింపబడిన 10 మంది కార్మికుల విషయమై ఆలోచించుటకు ఒక విచారణ సంఘాన్ని నియమించుటకు గవర్నమెంటు నిర్ణయించింది. కార్మిక సంఘాన్ని గుర్తించుటకు ప్రెస్ యజమాని అంగీకరించాడు. ఇక ముందు ఏ తగాదాలు వచ్చినా యజమానికి, యూనియన్‌కు మధ్య సంప్రదింపుల ద్వారా పరిష్కరింప బడగలవు.

### బెజవాడ

#### అసమ్మతి చూపుటకు సమ్మె

రాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియన్ వారిచే నిర్ణయింపబడి బెజవాడ ప్రెస్ వర్కర్సు యూనియన్ వారిచే అంగీకరించ బడిన కనీసపు కోర్కెలు షుమారు రెండునెలల క్రితము యజమానులకు పంపిరి. తరువాత శ్రీయుత పేట బాపయ్యగారు (జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు) పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు (ఆంధ్రరాష్ట్ర ప్రెస్ వర్కర్సు యూనియన్ కార్యదర్శి) యూనియన్ ప్రతినిధులుగా కొంతమంది యజమానుల దగ్గరకు వెళ్ళి కనీసపు కోర్కెలనుగూర్చి వారితో మాట్లాడిరి. కాని వాటివిషయము యింతవరకు యూనియన్‌కు వారి యభిప్రాయమును తెలియచేయలేదు. కోర్కెలను ఆచరణలో పెట్టడము కూడ జరుగలేదు. కోర్కెలను యంగీకరించ నందులకు తీవ్రమైన యసమ్మతిని తెలియచేయుటకు, కామేశ్వర అండు కో. ప్రెస్‌లో సమ్మెచేయుచున్న కార్మిక సోదరులకు సానుభూతి వెలిబుచ్చుటకు (ది 13-7-38 బుధవారము) అన్ని ప్రెస్సుల కార్మికులును సమ్మె చేయుటకు నిశ్చయించు కొనిరని తెలియుచున్నది.

#### కనీసపు కోర్కెలు.

1. ఆరు నెలలు అప్రెంటిస్ చేసిన తరువాత నెలకు కనీసము 10 రూపాయలు జీతము; సంవత్సరము దాటిన తరువాత నెలకు కనీసము 15 రూపాయల జీతము. 15 రూపాయల జీతము కలిగివున్న వారికి వెంటనే రెండు రూపాయలు అధికము చేయవలెనని.
2. రోజుకు 8 గంటలకు మించని పని చేయించవలెను.
3. యూనియన్‌ను యజమానులు వెంటనే గుర్తించ వలెనని.
4. సంవత్సరమునకు 15 రోజులు క్యాజుయల్ లీవు (జీతముమీద).
5. 7వ తేదిలోపు జీతములు.

## కత్తిరింపులు

డిసిప్లినరీ చర్యల కసమ్మతి

—శీర్షిక

క్రింది పౌరసత్వపు హక్కుల్ని సంరక్షించడానికి పూనుకోవలసినదిగా మద్రాసు మంత్రి వర్గంవారిని ఈ సంఘంవారు కోరుతున్నారు.....

—ఆశీర్షిక క్రింద విషయం

(నవశక్తి, 6-7-38. 17 వ పుట)

★

రామన్‌మీనన్‌గారి కార్యక్రమం

పశ్చిమ గోదావరి జిల్లా పర్యటనం

—శీర్షిక

జూలై 12 మద్రాసు నుండి బయలుదేరి 13 కాకినాడ, అమలాపురం, 14 రాజోలు, 15 రాజమండ్రి .... 17 మరల చెన్నపురి చేరెదరు.

—ఆ శీర్షిక క్రింద విషయం

(ఆంధ్రపత్రిక 6-7-38)

★

సర్దారు వల్లభాయి పటేలు

కిరీటము వహింపని రాజు.

ఫెడరేషన్ మొదటి ప్రధాన మంత్రి కావచ్చును.

★

—ఆంధ్రపత్రిక వారి ప్రత్యేక విలేఖరి "బొంబాయి లేఖకు" ఆంధ్రపత్రిక ఇచ్చిన శీర్షిక.

★

"ఫెడరేషన్‌ను గురించి నేనంతగా ఆలోచించడం లేదు."

—నెహ్రూ, లండన్ ఉపన్యాసంలో.

★ ★

"తడుముకోకుండా మనకు భాష రావలెను, "కలియు" అనే దానికి ప్రేరణార్థకం "కలుపు" గదా; "కురియు" అనే దానికి - కురుపా?

★

హైడ్రోజిన్ అంటే ఉదజని అని పేరు పెడుతున్నారు. హైడ్రోజిన్ అనరాదా అంటాను. ఎన్ని పేర్లు పెట్టినా, బస్సుకు బస్సే, కారుకు కారే, బైకుకు బైకే.

—మద్రాసు ప్రతికా సంపాదకుల సమావేశంలో గిడుగు రామమూర్తి పంతులుగారు.

★

మార్క్సు నర్థము చేసికొనిన విచారణ కర్తలు మన దేశమున ఎందరో లేరు. ఆంధ్ర దేశమున నున్నను ఒక రిద్దరున్నారేమో. "విప్లవము వర్ధిల్లుగాక" యని, సోషలిజం, కమ్యూనిజం అని ఘోషించు వారలలో బహుసంఖ్యాకులకు తమ ఘోషయొక్క అర్థస్ఫూర్తి యిసుమంతైనను తెలియదని చెప్ప సాహసించు చున్నాను.

మనుజునిలో ఆధ్యాత్మ సత్త, దివ్యసత్త, యొకటి అన్నిటికిని పైది కలదని యనుచుందురు. అట్టిది యుండిన ఉండవచ్చును.....

—యం. యన్. రాయిగారి వ్యాసాన్ని అనువదించిన "వేలూరి సదానందం"గారు తమ అనువాదానికి ప్రవేశికలో—

(ఆంధ్ర వారపత్రిక 29-6-38)

## మన రాజకీయాలు

# ఊటీ బ్యాంకు ఖైదీలు విడుదల అవుతారా?

### సత్యమూర్తిగారి చల్లని ప్రసంగాలు: రంగా-బోస్ సంభాషణలు

రంగా — బోసు.

రంగాగారు కలకత్తాలో ఉన్నప్పుడు, కాంగ్రెసు—కిసాన్ సంబంధాన్ని గురించి, ఆంధ్ర దేశములో రాష్ట్ర కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంవారు అల్లూరి సత్యనారాయణ మొదలైన సోషలిస్టులపై అమలు జరిపిన డిసిప్లినరీ చర్యలను గురించి సుభాష్ చంద్రబోసు గారితో సంభాషించారు,

జరిగిన గొడవఅంతా వర్కింగు కమిటీకి తెలియజేస్తే విచారణ కమిటీ వేయవచ్చునని సుభాషు సూచించాడట! మొదటి నుండీ యువకులకు అండయై సహాయంచేసిన సుభాష్‌బోసు యిప్పుడు కూడా వారికి న్యాయం కలిగేటట్లు చూస్తాడని నమ్మవచ్చును.

ఇద్దరు మదరాసు మంత్రులు

క్యాలికట్‌లో కె. రామునిమీనన్‌గారు ఉపన్యసిస్తూ, మద్యపాన నిషేధాన్ని గురించి యీ విధంగా చెప్పారు:

"మద్యపాన నిషేధం పెడితే, ఒక్క మీ జిల్లాలో రు 29 లక్షల రూపాయలు నష్టంవస్తుంది. మలబార్‌లో ప్రతిచోటా సభలుజరిపి, ప్రజలకు మంచి రోడ్లు, ఆసుపత్రులు, స్కూళ్లు అవసరంలేదని ప్రభుత్వానికి తెలియజేస్తే, అప్పుడు మద్యపాన నిషేధాన్ని అమలు పరచుటకు ప్రయత్నిస్తాం."

ఈ విషయాన్ని గురించే బెజవాడ గోపాల రెడ్డిగారు కోయిల్‌పట్టులో ఉపన్యసిస్తూ యీ క్రింది విధంగా చెప్పారు:

"ఈ జిల్లాలో మద్యపాన నిషేధంవల్ల ప్రతియేటా 20 లక్షల రూపాయలు నష్టం వస్తుంది. కాని, గవర్నమెంటు నష్టానికి అట్టే లక్ష్యపెట్టదు. ఎందువల్లనంటే, బీద ప్రజలకు దానివల్ల సుఖజీవనం కలుగుతుంది."

నష్టం కలుగుతుందని ప్రజోపయోగ కార్యాలు మానివేయడం రాజనీతి కోవిదులు చేయదగినదికాదు. నష్టాన్ని పూరించడంలో చూపాలి తమ మేధాశక్తిని.

★

అసలు పోరాటమే ఉండకూడదా?

ఈమధ్య శివగంగలో జరిగిన తాలూకా రాజకీయ మహాసభలో సత్యమూర్తిగారు ఉపన్యసిస్తూ యీవిధంగా సెలవిచ్చారు:

"సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని మనమింకా పొందలేదు. కాని, హింసాయుత పద్ధతులతోగాని, హింసారాహిత్య పద్ధతులతోగాని మరొక పోరాటం లేకుండానే స్వరాజ్యాన్ని సాధించాలని నేను గట్టిగా నమ్ముతున్నాను."

సత్యమూర్తిగారు తీసుకున్న పై దృక్పథానికీ, మితవాద పార్టీ (Liberals) పంథాకును భేదం ఏమీ కనపడదు. శాసనోల్లంఘనోద్యమం తీవ్రంగా జరిగే రోజుల్లో మితవాదులు కాంగ్రెసుకు వ్యతిరేకంగా మాట్లాడారు. శాసనోల్లంఘనం నాశనకారి అన్నారు. అప్పటి మితవాదులు యిప్పటి సత్యమూర్తిగారు ఒకే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. కాంగ్రెసుసంస్థ సుమారు 50 సంవత్సరముల క్రితం పుట్టింది. కాని, ప్రజాబాహుళ్యంతో సంబంధ మేర్పరచుకొని, బ్రిటిషు ప్రభుత్వంతో తీవ్రమైన పోరాటాన్ని సాగించింది 20 సంవత్సరాల నుంచి. ఈనాడు కాంగ్రెసుకు యింత బలము. యింత పలుకుబడి ఇతర దేశాలలో ఇంత ప్రఖ్యాతి ఉన్నదంటే దానికి కారణం ప్రత్యక్ష పోరాటమేనని చెప్పాలి. దాన్ని విడిచిపెడితే కాంగ్రెసు పూర్వంవలెనే ఒక మితవాద కూటంగా తయారౌతుంది. సామ్రాజ్యవాదులు ఒకవైపు ఫెడరేషన్ విధానాన్ని మన నెత్తిని రుద్దుటకు ఆలోచిస్తున్నారు. మరొకవైపు అంతర్జాతీయంగా ప్రపంచ సంగ్రామం నేడో రేపో వచ్చేటట్లు ఉంది: దాన్లో బ్రిటన్ తప్పకుండా చేరుతుంది. అప్పుడు భారతీయులు బ్రిటన్‌కు సహాయం చెయ్యరాదని లక్నో, ఫెయిజుపూరు, హరిపుర కాంగ్రెసు తీర్మానాలున్నాయి. వాటిని ఆచరణలో పెట్టాలంటే, తిరిగి ఏ పన్నుల నిరాకరణమో, ఏ శాసనోల్లంఘనమో రాకతప్పదు. ప్రత్యక్ష పోరాటం కాంగ్రెసుకు ఊపిరివంటిది. అట్టి బలవత్తరమైన ఆయుధాన్ని విడిచిపెట్టి సత్యమూర్తిగారు సంపూర్ణ స్వాతంత్ర్యమెట్లా సంపాదిస్తారో బోధపడదు.

★

బెంగాల్.

బెంగాల్‌లోని చిటగాంగు జిల్లాలో యించుమించు యువకులందరు గుర్తింపు కార్డుల (identity cards) ను కలిగియుండాలి. ఏ ప్రభుత్వోద్యోగి అడిగినను, వాటిని చూపాలి. చూపకపోతే ఎరస్టు చేయడానికి అధికారంఉంది. ఇప్పుడీ పద్ధతి నిర్మూలించబడింది. డెటిన్యూలను కూడా క్రమక్రమముగా విడుదల చేస్తున్నారు. గాంధిగారి ప్రయత్నాలు ప్రజల ఆందోళన కొద్దికొద్దిగా సఫల మవుతోందని చెప్పవచ్చు. కాని, చాలాకాలం శిక్ష విధింపబడ్డ రాజకీయ ఖైదీలను విడుదలచేసే ఉద్దేశం బెంగాల్ ప్రభుత్వానికి లేనట్లు తెలుస్తోంది. ఈవిషయమై స్పష్టంగా ప్రభుత్వ ప్రతినిధులు బోసుగారితో చెప్పారని రూఢియైన వార్తలువచ్చాయి. విద్యార్థులపై ఉపాధ్యాయులు సి. ఐ. డి. పని చేయాలని చాలాచోట్ల నిర్బంధం ఉంది. అది యింకా తొలగింప బడలేదు. విడుదల అయిన ఘూపేంద్రనాధ సన్యాల్ మొదలైన రాజకీయ బందీలు తమ స్వరాష్ట్రమైన బెంగాల్‌లో కాలుపెట్టకూడదని నిషేధాలు పంపబడ్డాయి. ఈమధ్యనే వీరేంద్రనాధ భట్టాచార్య అను విద్యార్థి నాయకునిపై రాజద్రోహనేరం మోపబడింది. విడుదల అయిన డెటిన్యూలు నిరుద్యోగులై ఆత్మహత్య చేసుకొంటున్నారు.

గవర్నరుతో పేచీలేక ఉండకూడదా?

ఈ మధ్య అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఆంధ్ర రాష్ట్రాందోళనను గురించి ఒక ప్రకటనచేశారు. వివిధ శాసనసభ్యులు ముఖ్యంగా తెలుగు శాసనసభ్యులు ప్రత్యేకమైన భాషలో మాట్లాడితే, శాసనసభా కార్యక్రమానికి ప్రతిష్టంభనం కలుగుతుందనిన్నీ, గవర్నరుతో అనవసరంగా పేచీలు తెచ్చుకోవలసి యుంటుందనిన్నీ: కాబట్టి యెవ్వరిభాషలో వారుమాట్లాడక ఇంగ్లీషులోనే మాట్లాడాలనీ కాళేశ్వరరావుగారు వాదించారు.

శాసనసభా కార్యక్రమం పాడవుతుం దన్నమాట నిజమే. కాని, గవర్నరుయొక్క స్నేహాన్ని పోగొట్టుకుంటున్నామని కాళేశ్వరరావుగారు చింతించడంలో అర్థం లేదు.

★

విద్యావిధానంలో మార్పులు.

బొంబాయి రాష్ట్రములో విద్యా విధానమందు మార్పులు సూచించవలసినదిగా ప్రభుత్వమువారొక ఉపసంఘాన్ని నియమించారు, ఆ ఉపసంఘం తన నివేదికను ప్రకటించింది. దాని ప్రకారం మెట్రిక్యులేషన్ పరీక్షలు, అంతకు క్రింది తరగతుల పరీక్షలు పూర్తిగా నిర్మూలించి, ఏ తరగతి ఉపాధ్యాయులు ఆ తరగతి యందలి బాలుర శక్తి సామర్థ్యములను బట్టి ప్యాసుచేయాలి.

పాశ్చాత్య దేశాలలో యీ విధానమే నేడు అమలులో ఉంది. ఇట్టిమార్పు చేయబడితే, పరీక్షలు అనే పెనుభూతం ఇక విద్యార్థులను పీడించదు. వారమున కొకసారి ఉపాధ్యాయుడు పిల్లలను పరీక్షచేస్తూ ఎంతవరకు పాఠములను శ్రద్ధతో చదువుతున్నారో, చదివిన పాఠాలవల్ల ఎంతవరకు బుద్ధి వికసిస్తోందో పరిశీలించవచ్చు. ఇప్పటివలె పరీక్షలో ఎట్టి ప్రశ్నలు వస్తాయో వాటికి జవాబు లేవిధంగా ఈయాలో, ఆజవాబులను పిల్లలచేత యింటివద్ద వ్రాయించి, బుఱ్ఱలో వేయించి, ఈవిధంగా వారిని శల్యావశిష్టులుగా చేయడం తప్పుతుంది. విద్యార్థులూ సంతోషిస్తారు. తల్లితండ్రులూ సంతోషిస్తారు, ఈ సూచనను ప్రభుత్వం అంగీకరిస్తుందని నమ్ముతున్నాం.

★

ఊటీ కేసు ఖైదీలు.

మదరాసు రాజధానిలో ఎరస్టు చేయబడి, మదరాసు రాజధానిలోనే శిక్షింపబడ్డ ఊటీ బ్యాంకు కేసు ఖైదీల విషయమై రాజాజీ మంత్రివర్గం యింత అశ్రద్ధ చూపుట నిజంగా కాంగ్రెసువాదు లందరికీ సిగ్గుచేటు. ఒకవైపు బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలో రాజద్రోహనేరాలక్రింద అనేకమందిని ఎరస్టు చేస్తున్నారు. మరొకవైపు, కాంగ్రెసు మంత్రులే అధికారంలో ఉన్న మద్రాసు రాష్ట్రంలో రాజకీయ ఖైదీలను పూర్తిగా విడిచిపెట్టలేదు. రేపు జూలై 12వ తేదీనుండి ఖుషీరాం, ప్రేమప్రకాశ, హజారాసింగు అను ముగ్గురు ఊటీ బ్యాంకు కేసు ఖైదీలు నిరశనవ్రతం ప్రారంభిస్తున్నామని రాజాజీకి నోటీసిచ్చారు. దీనితో పంజాబు ప్రభుత్వంతోనూ సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వంతోనూ, జోరుగ ఉత్తర ప్రత్యుత్తరాలు సాగుతున్నాయి. త్వరలో వీరిని విడుదల చేస్తారని తెలియుచున్నది.



## రైల్వే అధికార్ల లంచ గొండితనం

నేడు మన భారతదేశంలో పీడింపబడుతూన్న వర్గాలలో రైతు వర్గమొకటి. కూలీ వర్గంకూడా పీడింపబడుతూవున్న సంగతి అందరికీ తెలిసిన విషయమే. కాని వీరు ప్రత్యక్షంగా ధన రూపంగా పీడింపబడక కేవలం శారీరకంగా దోపిడీ చేయబడతూ నిర్వీర్యులుగా తయారవుతున్నారు.

కాని రైతువర్గాన్ని చూస్తే ముఖ్యంగా ధన రూపంగా పీడింపబడతూ వున్నారు. ఈపీడన శిస్తుల రూపంగాను, లంచాల రూపంగాను జరుగుతూవుంది. కార్మికవర్గం కేవలమొక పెట్టుబడిదారీ వర్గంతోను, మిల్లు యజమానులతోను నిత్యం దోపిడీ చేయబడుతున్నారు. కాని రైతు అలాకాకుండా పెట్టుబడిదార్లతోను, మిల్లు యజమానులతోను, ప్రభుత్వ ఆఫీసర్లతోను, జమీందార్లతోను, ఆఫీసు గుమాస్తాలతోను వేయేల ప్రతి డిపార్టుమెంటు వాళ్ళతోను ఇల్లుకదిలి బయట అడుగుపెడితే చాలు లంచాలరూపంగా పీడింపబడుతూ క్రుంగిపోతున్నారు. లంచాలివ్వటానికి శక్తి లేదు. ఇవ్వకపోతేనా పని జరగదు. ఎలాచస్తాము? ముందు నుయ్యి వెనుక గొయ్యిగావుంది. పైగా వీటికితగినట్లు శిస్తుల బాధకూడా మితిమీరిపోతూంది, యిదిలావుండగా పి. డబ్ల్యు. డి. వాళ్ళు, కోర్టు గుమాస్తాలు లంచాలకోసం పెట్టేబాధలు యింతింతనరాదు. మరొక విషయం పోలీసు డిపార్టుమెంటులో చూస్తే చెప్పనక్కరలేదు. లంచాలు. లంచాలిస్తే ఎటువంటి నేరమైనా రద్దయిపోతుంది. మామూళ్ళుగాని ముట్టక పోయినవా వీడికి మూడిందన్నమాటే, కాసేపట్లో మహాపరాధి అయిపోతాడు.

యివన్నీ యిలావుండగా రైల్వే వాళ్లుకూడా మామూళ్ళంటూ వసూలు చెయ్యటం మొదలుపెట్టారు. అందులో నాకు బాగా తెలిసిన ఒక విషయాన్ని గూర్చి వ్రాస్తాను.

మా ప్రాంతాల్లో అంటే గుడివాడ తాలూకా కొన్ని గ్రామాలల్లో యీ సంవత్సరం వర్షా లెక్కువగా కురియుట వల్లను, నారుమళ్ళు సరిగా సకాలంలో సప్లయి కాకపోవుటవల్లనూ దూర గ్రామాలకు వెళ్ళి బస్తా 1కి వంద రూపాయల ఖరీదుపెట్టి కూడా కొనుక్కొని రావలసి వచ్చింది, యింత ఖరీదు పెట్టి కొనుక్కొని రావాలంటే సామాన్యంగా పేద రైతుకి సాధ్యం కాదు. అందువలన కొంత చౌకగా దొరుకుతుందనే వుద్దేశంతో కైకలూరు తాలూకా గ్రామాలకు వెళ్ళి గరువు భూముల్లో పెంచబడినదంపనారు కొనితీసికొనిరావలసి వచ్చింది. యిది తీసికొని రావటానికి బండ్లు వెళ్ళటానికి గాని లారీలలో తీసికొని రావటానికి గాని సదుపాయాలు లేవు, అందువల్ల తప్పని సరిగా రైళ్ళలో వేసికొని రావలసి వచ్చింది, కైకలూరునకు సమీపంలోనున్న గ్రామాలనుంచి రావాలంటే గుడివాడ భీమవరం లైనులో రావాలి. ఆలైను స్టేషను మాస్టర్లు చేసే లంచ గొండితనము మహా విపరీతంగా వుంది. కోరిన కోరిక చెల్లించక పోతే రైతుల నారుమోపులు యింటికి చేరవు. చేరకపోతే సొమ్మంతా గల్లంతు, యిదే సమయమనుకున్నారు, అదును కనిపెట్టి గుంజసాగారు, అందరికి ఊనాధరస్న కల్పించే రైతు అందరికీ లోకువయ్యాడు, అమాయకుడు.

## లేఖలు

యీ లంచం తీసికొన్న వాళ్ళ విషయం ఒకటి చెపుతాను. ఆకివీటికి సమీపాన ఉన్న గ్రామాలకు వెళ్ళి నానా అవస్థలూ పడి అంటే రైలెక్కితే డబ్బు ఖర్చు అవుతుందనే వుద్దేశంతో చద్ది అన్నాలు మూటకట్టుకొని కాలినడకను ప్రయాణంచేసి వెళ్ళి బస్తా 1కి రు. 15, 20 రూపాయలకు కొంటే, ఖర్చులు 25, 30, రూపాయలైనది. యీ ఖర్చు దేనికంటే వాళ్ళు చెప్పిన లెక్కలనే చూపిస్తాను. కుంచం 1కి కొను ఖరీదు రు. 0-14-0 అణాలు. 0-4-0 అణాలు పడవచార్జి. నారు లాగిన వాళ్ళకి కొంత. యీ ఖర్చులతో స్టేషనుకి చేర్చితే అక్కడ గూడ్సు చార్జి మణుగు 1కి 0-1-6 మాత్రమట. అంటే ఇది తక్కువ చార్జి అని నావుద్దేశం కాదు. తీసికొన్న లంచాని కంటె తక్కువని గాని, స్టేషను మాస్టరు కిచ్చినది మ 1కి 0-2-6 చొప్పున యిచ్చారు. బస్తానారు సుమారు 35, 40 మణుగు లుంటుంది. ఈ మణుగులకు రైల్వే చార్జి కంటె మాస్టరు గారి చార్జి ఎంత అదనంగా వుందో దీన్నిబట్టి చూస్తే మీకే తెలుస్తుంది. యిక దీనితో సరిపోతే సంతోషమే. యెగుమతి చేసిన మాస్టరు గారికింత ముడితే దిగుమతి చేయించేవారేనా తక్కువ. యెగుమతి చేసిన వారికంటె వీరికి కొంత తక్కువ పైకమే ముట్టినట్లు చెప్పారు. అంటే మ 1కి 0-1-0 సరిపెట్టు కొన్నారు. యీ అణాతో తృప్తిపడ్డ మోటూరు స్టేషను మాస్టరుని చూచి రైతులు పాపం అమాయకపు రైతులు, కుడుము పండుగనుకొనే రైతులు, ఎంతో వుబ్బి తబ్బిబ్బయి అరే బలే మంచివాడురా యీ మాస్టరుగారు మహానుభావుడు అణాతోనే సంతోషించాడు, అంటూ వంగివంగి నమస్కారాలు చేస్తారు. లంచాలు చాలా యిచ్చారు, కాని సాక్ష్యం చెప్పవయ్యా కేసు పెడదామంటే! ఎందుకులే బాబు దీనితో పోయింది కాకుండా పనిరోజుల్లో కోర్టు చుట్టూ తిరగలేక చావాలి అంటూ వాపోయాడు. ఇదే మాదిరిగా మా గ్రామంలోని రైతులు కూడ విషయాలన్నీ చెప్పారు గాని వ్యవహారం విచారణకు వస్తే యెంతవరకు నిలబడి సాక్ష్యమిస్తారో మాత్రం చెప్పలేను. కాని తగు చర్య తీసికోటానికే యత్నిస్తున్నాను. యీ రైల్వే వాళ్ళ లంచాలను గూర్చి సామాన్యంగా రైళ్లలో ప్రయాణీకుల కందరికీ తెలిసే వుంటుంది.

కనుక ఆయా స్టేషన్లకు సమీపాన ఉన్న రైతు శ్రేయోభిలాషు లెల్లరు మాస్టర్లకు వత్తిడి కలిగించి సక్రమ ప్రవర్తనకు దారిచూపి రైతులను రక్షించాల్సిందిగా ప్రార్థిస్తున్నాను.

—పొట్లూరి వీరరాఘవస్వామి.

## బెజవాడ హాకర్సు

### మార్కెట్టు కంట్రాక్టర్ల అక్రమ వసూళ్లు.

బెజవాడ మున్సిపాలిటీవారు మార్కెట్టు ఫీజు వసూలుచేయు హక్కు వేలమువేసిరి.

1938 ఫిబ్రవరి గెజిటు మునిసిపల్ షీటులో యీ విధముగా ప్రచురింపబడినది.

1938—39 సంవత్సరమునకు బెజవాడ మునిసిపాలిటీలో యీదిగువ స్థలములలోను, మార్కెటులలోని కొట్లకు యీదిగువ రేట్ల ప్రకారము అద్దె వసూలుచేయు హక్కును వేలము వేయబడును. ఈదిగువ స్థలములలో ఫీజు వసూలు చేయబడును.

1. కొత్తపేట మార్కెటు
2. హైదరాబాదు రోడ్డు ప్రక్కన కూరల మార్కెటు
3. గడ్డి మార్కెటు
4. గవర్నరుపేట మార్కెటు
5. మరియు నాటకశాలల వద్దను మాత్రమే

వసూలు చేయవలసిన ఫీజు

| | | |
|---|---|---|
| కావడి బరువులకు | మార్కెటు | 0-0-6 |
| బండి బరువులకు | స్థలములో | 0-1-0 |
| తల బరువులకు | అమ్మినపుడు | 0-0-3 |

గెజిటులోని మున్సిపల్ షీటుయందు విపులముగా వసూలు చేయవలసిన ఫీజు, స్థలములు నిర్ణయించబడి నప్పటికి మున్సిపల్ కంట్రాక్టర్లు రోడ్లవెంబడి తిరిగి కూరగాయలు, పచ్చిగడ్డి, గడ్డిబండ్లు, రొట్టెలు, పండుంపుల్లలు, శెనగపప్పు అమ్ముకునే వారివద్ద నుంచి జబర్‌దస్తీ చేసి ఫీజు వసూలు చేయుచున్నారు. మునిసిపాలిటీవారు వేలమువేసినది పై నుదహరించిన మార్కెటు స్థలమునకు అద్దె వసూలుచేసుకొను హక్కుమాత్రమే. కనుక ఇతరచోట్ల అమ్ముకునే వారివద్ద ఫీజు వసూలుచేయుహక్కు ఈ మార్కెటు కంట్రాక్టర్లకు లేదు. రోడ్ల మార్జినులందు దుకాణములు పెట్టినయెడల రోడ్లు అక్రమించినవారిని ప్రాసిక్యూటు చేయుటకు మున్సిపాలిటీవారికి హక్కుగలదు. వారివద్ద రెట్టింపు ఫీజు వసూలుచేయు యధికారముకూడ మునిసిపాలిటీవారిది కాని కంట్రాక్టర్లది కాదు. యెందుకనగా మార్కెటు కంట్రాక్టర్లు వేలము పాడుకొనినది పైనుదహరించిన యైదు స్థలములు మాత్రమే.

అదే విధముగా బండ్లు, బండ్ల దొడ్డిలోనికి వచ్చినప్పుడే ఆ బండ్లవారి వద్దనుంచి ఫీజు వసూలు చేయవచ్చును. కాని ప్రస్తుతము ఈ బండ్లదొడ్డి కంట్రాక్టర్ల గుమాస్తాలు వూరికి నాలుగువైపుల కూర్చొని వస్తూపోయే బండ్లకు కూడ ఫీజు వసూలుచేయుచున్నారు. ఎవరైనను యీఫీజు యిచ్చుటకు నిరాకరించినయెడల యీ కంట్రాక్టర్ల గుమాస్తాలు దౌర్జన్యమునకు దిగుటకూడ జరుగుచున్నది.

మార్కెటు కంట్రాక్టర్లు చేయుచున్న అక్రమ వసూళ్ళను అరికట్టుటకని శ్రీయుత కాట్రగడ్డ పిచ్చయ్యగారు చాలా శ్రద్ధతీసుకొనిరి. వారు 29-6-38 న యీ అక్రమ వసూళ్ళ విషయమై మునిసిపల్ కమిషనరుగారికి తెలియచేసిరి. డివిజినల్ కాంగ్రెస్ కమిటీలు కరపత్రముల ద్వారా యీ అక్రమ ఫీజు యివ్వనవసరము లేదని ప్రచారముచేసిరి. 1-7-38 నుండి సోషలిస్టులు, కాంగ్రెస్‌వారు మార్కెటుదగ్గర బేరముచేయు వారితో మార్కెటు కంట్రాక్టర్లు అక్రమముగా వసూలుచేయు ఫీజును యివ్వనవసరము లేదని తెలియజేసి యీ బేరగాళ్ళను మునిసిపల్ కమిషనరువద్దకు తీసుకొనివెళ్ళగా కమిషనరుగారు వీధులవెంబడి తిరిగి అమ్ముకొను వారివద్దనుంచి యేవిధమైన ఫీజు వసూలు చేయుటకు వీలులేదని చెప్పిరి. తరువాత కూరగాయల బేరగాళ్ళ తరఫున పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు మునిసిపల్ కంట్రాక్టర్లు స్వయముగా యీ పురపాలక సంఘమునకు వైస్‌ఛైర్మనుగారగు పోలిన గణపతిరావుగారితో యీ మార్కెటు ఫీజు విషయమై మాట్లాడుకొనిరి, చివరకు వైస్‌ఛైర్మను గారియెదుట, నెత్తిమీద పెట్టుకొని వీధులవెంబడి తిరిగి బేరము చేయువారి వద్దనుంచి ఫీజు వసూలు చేయమని చెప్పిరి.

కాని పచ్చిగడ్డి నెత్తిమీద పెట్టుకొని తిరిగి అమ్ముకొను వారివద్దనుంచి, శనగపప్పు అమ్ముకొను వారి వద్దనుంచి ఫీజు అక్రమముగా వసూలు చేయుచున్నారు. ఈనెల 9, 10 తేదీలందు సోషలిస్టులు కాంగ్రెస్ వర్కర్సు యీ అక్రమ వసూళ్ళు యివ్వనవసరములేదని వారికి తెలియచేసిరి. కంట్రాక్టర్ల గుమాస్తాలు కొంత ఘర్షణ సాగించిరి.

ఈ అక్రమ వసూళ్ళ విషయమై శ్రద్ధ తీసుకొని పట్టుదలతో పని చేయుచున్నందుకు మార్కెట్టు కంట్రాక్టర్లు శ్రీయుత కాట్రగడ్డ పిచ్చయ్యగారికి వారు కోర్టు ద్వారా నష్ట పరిహారార్థము కోర్టు ద్వారా చర్య తీసుకొనెదమని రిజిష్టరు నోటీసు పంపిరి.

మున్సిపాలిటీ కాంగ్రెస్ ఆధీనమందున్నప్పుడు యీ అక్రమ వసూళ్ళను సాగనివ్వకూడదు. నెత్తిమీద పెట్టుకొని వీధుల వెంబడి తిరిగి బేరము చేయువారికి లాభము చాలా స్వల్పమైనను, పురజనులకు మాత్రము చాలా సహాయము చేయుచున్నారు. కనుక అక్రమ వసూళ్ళను ఆపుదలచేసి కాంగ్రెసు ప్రతిష్ఠ యభివృద్ధి పరచెదరని యాశించుచున్నాము.

—ఒక పౌరుడు.

పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహక వర్గ సమావేశము; ది 15-7-38 ఉదయం 11 గంటలకు నర్సాపురం తాలూకా కాంగ్రెసు ఆఫీసు, పాలకొల్లులో ఈ క్రింది విషయములు చర్చించడానికి జరుగును.

1 కాశీపట్టణము రైతు సమస్య.

2 పార్టీ పత్రిక యైన నవశక్తికి చందాదార్లను చేర్పించుటకు తగిన ఏర్పాట్లు.

3 కాంగ్రెసు సభ్యులను చేర్పించుట.

4 బెజవాడలో జరిగిన, సి, యస్. పి. తీర్మానములు అమలు జరుపుటను గురించి.

5 జిల్లాలోని యువ జనోద్యమమును గురించి.

6 పార్టీయొక్క ఆర్థిక విషయము గురించి జరుగును.

ఉ. రామం.
కార్యదర్శి.

మన రాజకీయాలు

# ఊటీ బ్యాంకు ఖైదీలు విడుదల అవుతారా?

## సత్యమూర్తిగారి చల్లని ప్రసంగాలు: రంగా-బోస్ సంభాషణలు

రంగా — బోసు.

రంగాగారు కలకత్తాలో ఉన్నప్పుడు, కాంగ్రెసు—కిసాన్ సంబంధాన్ని గురించి, ఆంధ్ర దేశములో రాష్ట్ర కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గంవారు అల్లూరి సత్యనారాయణ మొదలైన సోషలిస్టులపై అమలు జరిపిన డిసిప్లినరీ చర్యలను గురించి సుభాష్ చంద్రబోసు గారితో సంభాషించారు.

జరిగిన గొడవఅంతా వర్కింగు కమిటీకి తెలియజేస్తే విచారణ కమిటీ వేయవచ్చునని సుభాషు సూచించాడట. మొదటి నుండీ యువకులకు అండయై సహాయంచేసిన సుభాష్‌బోసు యిప్పుడు కూడా వారికి న్యాయం కలిగేటట్లు చూస్తాడని నమ్మవచ్చును.

ఇద్దరు మదరాసు మంత్రులు

క్యాలికట్‌లో కె. రామునిమీనన్‌గారు ఉపన్యసిస్తూ, మద్యపాన నిషేధాన్ని గురించి యీ విధంగా చెప్పారు:

"మద్యపాన నిషేధం పెడితే, ఒక్క మీ జిల్లాలో రు 29 లక్షల రూపాయలు నష్టంవస్తుంది. మలబార్‌లో ప్రతిచోటా సభలుజరిపి, ప్రజలకు మంచి రోడ్లు, ఆసుపత్రులు, స్కూళ్లు అవసరంలేదని ప్రభుత్వానికి తెలియజేస్తే, అప్పుడు మద్యపాన నిషేధాన్ని అమలు పరచుటకు ప్రయత్నిస్తాం."

ఈ విషయాన్ని గురించే బెజవాడ గోపాల రెడ్డిగారు కోయిల్‌పట్టులో ఉపన్యసిస్తూ యీ క్రింది విధంగా చెప్పారు;

"ఈ జిల్లాలో మద్యపాన నిషేధంవల్ల ప్రతియేటా 20 లక్షల రూపాయలు నష్టం వస్తుంది. కాని, గవర్నమెంటు నష్టానికి అట్టే లక్ష్యపెట్టదు. ఎందువల్లనంటే, బీద ప్రజలకు దానివల్ల సుఖజీవనం కలుగుతుంది."

నష్టం కలుగుతుందని ప్రజోపయోగ కార్యాలు మానివేయడం రాజనీతి కోవిదులు చేయదగినదికాదు. నష్టాన్ని పూరించడంలో చూపాలి తమ మేధాశక్తిని.

★

అసలు పోరాటమే ఉండకూడదా?

ఈమధ్య శివగంగలో జరిగిన తాలూకా రాజకీయ మహాసభలో సత్యమూర్తిగారు ఉపన్యసిస్తూ యీవిధంగా సెలవిచ్చారు;

"సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని మనమింకా పొందలేదు. కాని, హింసాయుత పద్ధతులతోగాని, హింసారాహిత్య పద్ధతులతోగాని మరొక పోరాటం లేకుండానే స్వరాజ్యాన్ని సాధించాలని నేను గట్టిగా నమ్ముతున్నాను."

సత్యమూర్తిగారు తీసుకున్న పై దృక్పథానికీ, మితవాద పార్టీ (Liberals) పంథాకును భేదం ఏమీ కనపడదు. శాసనోల్లంఘనోద్యమం తీవ్రంగా జరిగే రోజుల్లో మితవాదులు కాంగ్రెసుకు వ్యతిరేకంగా మాట్లాడారు. శాసనోల్లంఘనం నాశనకారి అన్నారు. అప్పటి మితవాదులు యిప్పటి సత్యమూర్తిగారు ఒకే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. కాంగ్రెసుసంస్థ సుమారు 50 సంవత్సరముల క్రితం పుట్టింది. కాని, ప్రజాబాహుళ్యంతో సంబంధ మేర్పరచుకొని, బ్రిటిషు ప్రభుత్వంతో తీవ్రమైన పోరాటాన్ని సాగించింది 20 సంవత్సరాల నుంచి. ఈనాడు కాంగ్రెసుకు యింత బలము, యింత పలుకుబడి ఇతర దేశాలలో ఇంత ప్రఖ్యాతి ఉన్నదంటే దానికి కారణం ప్రత్యక్ష పోరాటమేనని చెప్పాలి. దాన్ని విడిచిపెడితే కాంగ్రెసు పూర్వంవలెనే ఒక మితవాద కూటంగా తయారౌతుంది. సామ్రాజ్యవాదులు ఒకవైపు ఫెడరేషన్ విధానాన్ని మన నెత్తిని రుద్దుటకు ఆలోచిస్తున్నారు. మరొకవైపు అంతర్జాతీయంగా ప్రపంచ సంగ్రామం నేడో రేపో వచ్చేటట్టు ఉంది: దాన్లో బ్రిటన్ తప్పకుండా చేరుతుంది. అప్పుడు భారతీయులు బ్రిటన్‌కు సహాయం చెయ్యరాదని లక్నో, ఫెయిజుపూరు, హరిపుర కాంగ్రెసు తీర్మానాలున్నాయి. వాటిని ఆచరణలో పెట్టాలంటే, తిరిగి ఏ పన్నుల నిరాకరణమో, ఏ శాసనోల్లంఘనమో రాకతప్పదు. ప్రత్యక్ష పోరాటం కాంగ్రెసుకు ఊపిరివంటిది. అట్టి బలవత్తరమైన ఆయుధాన్ని విడిచిపెట్టి సత్యమూర్తిగారు సంపూర్ణ స్వాతంత్ర్యమెట్లా సంపాదిస్తారో బోధపడదు.

★

బెంగాల్.

బెంగాల్‌లోని చిటగాంగు జిల్లాలో యించుమించు యువకులందరు గుర్తింపు కార్డుల (identity cards) ను కలిగియుండాలి. ఏ ప్రభుత్వోద్యోగి అడిగినను, వాటిని చూపాలి. చూపకపోతే ఎరస్టు చేయడానికి అధికారంఉంది. ఇప్పుడీ పద్ధతి నిర్మూలించబడింది. డెటిన్యూలను కూడా క్రమక్రమముగా విడుదల చేస్తున్నారు. గాంధిగారి ప్రయత్నాలు ప్రజల ఆందోళన కొద్దికొద్దిగా సఫలమవుతోందని చెప్పవచ్చు. కాని, చాలాకాలం శిక్ష విధింపబడ్డ రాజకీయ ఖైదీలను విడుదలచేసే ఉద్దేశం బెంగాల్ ప్రభుత్వానికి లేనట్లు తెలుస్తోంది. ఈవిషయమై స్పష్టంగా ప్రభుత్వ ప్రతినిధులు బోసుగారితో చెప్పారని రూఢియైన వార్తలువచ్చాయి. విద్యార్థులపై ఉపాధ్యాయులు సి. ఐ. డి. పని చేయాలని చాలాచోట్ల నిర్బంధం ఉంది. అది యింకా తొలగింప బడలేదు. విడుదల అయిన భూపేంద్రనాథ సన్యాల్ మొదలైన రాజకీయ బందీలు తమ స్వరాష్ట్రమైన బెంగాల్‌లో కాలుపెట్టకూడదని నిషేధాలు పంపబడ్డాయి. ఈమధ్యనే వీరేంద్రనాథ భట్టాచార్య అను విద్యార్థి నాయకునిపై రాజద్రోహనేరం మోపబడింది. విడుదల అయిన డెటిన్యూలు నిరుద్యోగులై ఆత్మహత్య చేసుకొంటున్నారు.

గవర్నరుతో పేచీలేక ఉండకూడదా?

ఈ మధ్య అయ్యదేవర కాళేశ్వరరావుగారు ఆంధ్ర రాష్ట్రోందోళనను గురించి ఒక ప్రకటనచేశారు. వివిధ శాసనసభ్యులు ముఖ్యంగా తెలుగు శాసనసభ్యులు ప్రత్యేకమైన భాషలో మాట్లాడితే, శాసనసభా కార్యక్రమానికి ప్రతిష్టంభనం కలుగుతుందనిన్నీ, గవర్నరుతో అనవసరంగా పేచీలు తెచ్చుకోవలసి యుంటుందనిన్నీ; కాబట్టి యెవ్వరిభాషలో వారుమాట్లాడక ఇంగ్లీషులోనే మాట్లాడాలనీ కాళేశ్వరరావుగారు వాదించారు.

శాసనసభా కార్యక్రమం పాడవుతుం దన్నమాట నిజమే. కాని, గవర్నరుయొక్క స్నేహాన్ని పోగొట్టుకుంటున్నామని కాళేశ్వరరావుగారు చింతించడంలో అర్థం లేదు.

★

విద్యావిధానంలో మార్పులు.

బొంబాయి రాష్ట్రములో విద్యా విధానమందు మార్పులు సూచించవలసినదిగా ప్రభుత్వమువారొక ఉపసంఘాన్ని నియమించారు. ఆ ఉపసంఘం తన నివేదికను ప్రకటించింది. దాని ప్రకారం మెట్రిక్యులేషన్ పరీక్షలు, అంతకు క్రింది తరగతుల పరీక్షలు పూర్తిగా నిర్మూలించి, ఏ తరగతి ఉపాధ్యాయులు ఆ తరగతి యందలి బాలుర శక్తి సామర్థ్యములను బట్టి ప్యాసుచేయాలి.

పాశ్చాత్య దేశాలలో యీ విధానమే నేడు అమలులో ఉంది. ఇట్టిమార్పు చేయబడితే, పరీక్షలు అనే పెనుభూతం ఇక విద్యార్థులను పీడించదు. వారమున కొకసారి ఉపాధ్యాయుడు పిల్లలను పరీక్షచేస్తూ ఎంతవరకు పాఠములను శ్రద్ధతో చదువుతున్నారో, చదివిన పాఠాలవల్ల ఎంతవరకు బుద్ధి వికసిస్తోందో పరిశీలించవచ్చు. ఇప్పటివలె పరీక్షలో ఎట్టి ప్రశ్నలు వస్తాయో వాటికి జవాబు లేవిధంగా ఈయాలో, ఆజవాబులను పిల్లలచేత యింటివద్ద వ్రాయించి, బుక్కులో వేయించి, ఈవిధంగా వారిని శల్యావశిష్టులుగా చేయడం తప్పుతుంది. విద్యార్థులూ సంతోషిస్తారు. తల్లితండ్రులూ సంతోషిస్తారు. ఈ సూచనను ప్రభుత్వం అంగీకరిస్తుందని నమ్ముతున్నాం.

★

ఊటీ కేసు ఖైదీలు.

మదరాసు రాజధానిలో ఎరస్టు చేయబడి, మదరాసు రాజధానిలోనే శిక్షింపబడ్డ ఊటీ బ్యాంకు కేసు ఖైదీల విషయమై రాజాజీ మంత్రివర్గం యింత అశ్రద్ధ చూపుట నిజంగా కాంగ్రెసువాదు లందరికీ సిగ్గుచేటు. ఒకవైపు బెంగాల్, పంజాబ్ రాష్ట్రాలలో రాజద్రోహ నేరాలక్రింద అనేకమందిని ఎరస్టు చేస్తున్నారు. మరొకవైపు, కాంగ్రెసు మంత్రులే అధికారంలోఉన్న మద్రాసు రాష్ట్రంలో రాజకీయ ఖైదీలను పూర్తిగా విడిచిపెట్టలేదు రేపు జూలై 12వ తేదీనుండి ఖుషీరాం, ప్రేమప్రకాశ, హజారాసింగు అను ముగ్గురు ఊటీ బ్యాంకు కేసు ఖైదీలు నిరశనవ్రతం ప్రారంభిస్తున్నామని రాజాజీకి నోటీసిచ్చారు. దీనితో పంజాబు ప్రభుత్వంతోనూ సంయుక్తరాష్ట్రాల ప్రభుత్వంతోనూ, జోరుగ ఉత్తర ప్రత్యుత్తరాలు సాగుతున్నాయి. త్వరలో వీరిని విడుదల చేస్తారని తెలియుచున్నది.



# లేఖలు

## రైల్వే అధికార్ల లంచ గొండితనం

నేడు మన భారతదేశంలో పీడింపబడుతున్న వర్గాలలో రైతు వర్గమొకటి. కూలీ వర్గంకూడా పీడింపబడుతూవున్న సంగతి అందరికీ తెలిసిన విషయమే. కాని వీరు ప్రత్యక్షంగా ధన రూపంగా పీడింపబడక కేవలం శారీరకంగా దోపిడీ చేయబడుతూ నిర్వీర్యులుగా తయారవుతున్నారు.

కాని రైతువర్గాన్ని చూస్తే ముఖ్యంగా ధన రూపంగా పీడింపబడుతూ వున్నారు. ఈపీడన శిస్తుల రూపంగాను, లంచాల రూపంగాను జరుగుతూవుంది. కార్మికవర్గం కేవలమొక పెట్టుబడిదారీ వర్గంతోను, మిల్లు యజమానులతోను నిత్యం దోపిడీ చేయబడుతున్నారు. కాని రైతు అలాకాకుండా పెట్టుబడిదార్లతోను, మిల్లు యజమానులతోను, ప్రభుత్వ ఆఫీసర్లతోను, జమీందార్లతోను, ఆఫీసు గుమాస్తాలతోను వేయేల ప్రతి డిపార్టుమెంటు వాళ్ళతోను ఇల్లుకదిలి బయట అడుగుపెడితే చాలు లంచాలరూపంగా పీడింపబడుతూ క్రుంగిపోతున్నారు. లంచాలివ్వటానికి కాశక్తి లేదు. ఇవ్వకపోతేనా పని జరగదు. ఎలాచస్తాము ముందు నుయ్యి వెనుక గొయ్యిగావుంది. పైగా వీటికితగినట్లు శిస్తుల బాధకూడా మితిమీరిపోతూంది. యిదిలావుండగా పి. డబ్ల్యు. డి. వాళ్ళు, కోర్టు గుమాస్తాలు లంచాలకోసం పెట్టేబాధలు యింతింతనరాదు. మరొక విషయం పోలీసు డిపార్టుమెంటులో చూస్తే చెప్పనక్కరలేదు లంచాలు. లంచాలిస్తే ఎటువంటి నేరమైనా రద్దయిపోతుంది. మామూళ్ళుగాని ముట్టక పోయినవా వీడికి మూడిందన్నమాటే, కానేపట్లో మహాపరాధి అయిపోతాడు.

యివన్నీ యిలావుండగా రైల్వే వాళ్లుకూడా మామూళ్ళంటూ వసూలు చెయ్యటం మొదలు పెట్టారు. అందులో నాకు బాగా తెలిసిన ఒక విషయాన్ని గూర్చి వ్రాస్తాను.

మా ప్రాంతాల్లో అంటే గుడివాడ తాలూకా కొన్ని గ్రామాలల్లో యీ సంవత్సరం వర్షాలెక్కువగా కురియుట వల్లను, నారుమళ్ళు సరిగా సకాలంలో సప్లయి కాకపోవుటవల్లనూ దూర గ్రామాలకు వెళ్ళి బస్తా 1కి వంద రూపాయల ఖరీదు పెట్టి కూడా కొనుక్కొని రావలసి వచ్చింది. యింత ఖరీదు పెట్టి కొనుక్కొని రావాలంటే సామాన్యంగా పేద రైతుకి సాధ్యం కాదు. అందువలన కొంత చౌకగా దొరుకుతుందనే వుద్దేశంతో కైకలూరు తాలూకా గ్రామాలకు వెళ్ళి గరువు భూముల్లో పెంచబడినదంపనారు కొనితీసికొనిరావలసి వచ్చింది. యిది తీసికొని రావటానికి బండ్లు వెళ్ళటానికి గాని లారీలలో తీసికొని రావటానికిగాని సదుపాయాలు లేవు. అందువల్ల తప్పనిసరిగా రైళ్ళలో వేసికొని రావలసి వచ్చింది. కైకలూరునకు సమీపంలోనున్న గ్రామాలనుంచి రావాలంటే గుడివాడ భీమవరం లైనులో రావాలి. ఆలైను స్టేషను మాస్టర్లు చేసే లంచ గొండితనము మహా విపరీతంగా వుంది. కోరిన కోరిక చెల్లించకపోతే రైతుల నారుమోపులు యింటికి చేరవు. చేరకపోతే సొమ్మంతా గల్లంతు, యిదే సమయమనుకున్నారు అదును కనిపెట్టి సుంకంసాగారు. అందరికీ ఈ నాథ రక్షణ కల్పించే రైతు అందరికీ లోకువయ్యాడు, అమాయకుడు.

యీ లంచం తీసికొన్న వాళ్ళ విషయం ఒకటి చెపుతాను. ఆకివీటికి సమీపాన ఉన్న గ్రామాలకు వెళ్ళి నానా అవస్థలూ పడి అంతే రైలెక్కితే డబ్బు ఖర్చు అవుతుందనే వుద్దేశంతో చద్ది అన్నాలు మూటకట్టుకొని కాలినడకను ప్రయాణంచేసి వెళ్ళి బస్తా 1కి రు. 15, 20 రూపాయలకు కొంటే, ఖర్చులు 25, 30, రూపాయలైనది. యీ ఖర్చు దేనికంటే వాళ్ళు చెప్పిన లెక్కలనే చూపిస్తాను. కుంచం 1కి కొను ఖరీదు రు. 0-14-0 అణాలు. 0-4-0 అణాలు పడవచార్జి. నారు లాగిన వాళ్ళకి కొంత. యీ ఖర్చులతో స్టేషనుకి చేర్చితే అక్కడ గూడ్సు చార్జి మణుగు 1కి 0-1-6 మాత్రమట. అంటే ఇది తక్కువ చార్జి అని నావుద్దేశం కాదు. తీసికొన్న లంచాని కంటె తక్కువని గాని, స్టేషను మాస్టరు కిచ్చినది మ 1కి 0-2-6 చొప్పున యిచ్చారు. బస్తా నారు సుమారు 35, 40 మణుగు లుంటుంది. ఈ మణుగులకు రైల్వే చార్జి కంటె మాస్టరు గారి చార్జి ఎంత అదనంగా వుందో దీన్నిబట్టి చూస్తే మీకే తెలుస్తుంది. యిక దీనితో సరిపోతే సంతోషమే. యెగుమతి చేసిన మాస్టరు గారికింత ముడితే దిగుమతి చేయించేవారేనా తక్కువ. యెగుమతి చేసిన వారికంటె వీరికి కొంత తక్కువ పైకమే ముట్టినట్లు చెప్పారు. అంటే మ 1కి 0-1-0 సరిపెట్టుకొన్నారు. యీ అణాతో తృప్తిపడ్డ మోటూరు స్టేషను మాస్టరుని చూచి రైతులు పాపం అమాయకపు రైతులు, కుడుము పండుగనుకొనే రైతులు, ఎంతో వుబ్బి తబ్బిబ్బయి అరే బలే మంచివాడురా యీ మాస్టరుగారు మహానుభావుడు అణాతోనే సంతోషించాడు, అంటూ వంగివంగి నమస్కారాలు చేస్తారు. లంచాలు చాలా యిచ్చారు, కాని సాక్ష్యం చెప్పవయ్యా కేసు పెడదామంటే: ఎందుకులే బాబు దీనితో పోయింది కాకుండా పనిరోజుల్లో కోర్టు చుట్టూ తిరగలేక చావాలి అంటూ వాపోయాడు. ఇదే మాదిరిగా మా గ్రామంలోని రైతులు కూడ విషయాలన్నీ చెప్పారు గాని వ్యవహారం విచారణకు వస్తే యెంతవరకు నిలబడి సాక్ష్యమిస్తారో మాత్రం చెప్పలేను. కాని తగు చర్య తీసికోటానికే యత్నిస్తున్నాను. యీ రైల్వే వాళ్ళ లంచాలను గూర్చి సామాన్యంగా రైల్లో ప్రయాణీకుల కందరికీ తెలిసే వుంటుంది.

కనుక ఆయా స్టేషన్లకు సమీపాన ఉన్న రైతు శ్రేయోభిలాషు లెల్లరు మాస్టర్లకు వత్తిడి కలిగించి సక్రమ ప్రవర్తనకు దారిచూపి రైతులను రక్షించాల్సిందిగా ప్రార్థిస్తున్నాను.

—పొట్లూరి వీరరాఘవస్వామి,

## బెజవాడ హాకర్స్

మార్కెటు-కంట్రాక్టర్ల అక్రమ వసూళ్లు.

బెజవాడ మున్సిపాలిటీవారు మార్కెటు ఫీజు వసూలుచేయు హక్కు వేలమువేసిరి.

1938 ఫిబ్రవరి గెజిటు మునిసిపల్ షీటులో యీ విధముగా ప్రచురించబడినది.

1938—39 సంవత్సరమునకు బెజవాడ మునిసిపాలిటీలో యీదిగువ స్థలములలోను, మార్కెటులలోని కొట్లకు యీదిగువ రేట్ల ప్రకారము అద్దె వసూలుచేయు హక్కును వేలము వేయబడును. ఈదిగువ స్థలములలో ఫీజు వసూలు చేయబడును.

1. కొత్తపేట మార్కెటు
2. హైదరాబాదు రోడ్డు ప్రక్కన కూరల మార్కెటు
3. గడ్డి మార్కెటు
4. గవర్నరుపేట మార్కెటు
5. మరియు నాటకశాలల వద్దను మాత్రమే

వసూలు చేయవలసిన ఫీజు

| | | |
|---|---|---|
| కావడి బరువులకు | మార్కెటు స్థలములో అమ్మినపుడు | 0-0-6 |
| బండి బరువులకు | | 0-1-0 |
| తల బరువులకు | | 0-0-3 |

గెజిటులోని మున్సిపల్ షీటుయందు విపులముగా వసూలు చేయవలసిన ఫీజు, స్థలములు నిర్ణయించబడి నప్పటికి మున్సిపల్ కంట్రాక్టర్లు రోడ్ల వెంబడి తిరిగి కూరగాయలు, పచ్చిగడ్డి, గడ్డిబండ్లు, రొట్టెలు, పండుంపుల్లలు, శెనగపప్పు అమ్ముకునే వారివద్ద నుంచి జబర్‌దస్తీ చేసి ఫీజు వసూలు చేయుచున్నారు. మునిసిపాలిటీవారు వేలమువేసినది పై నుదహరించిన మార్కెటు స్థలమునకు అద్దె వసూలుచేసుకొను హక్కుమాత్రమే. కనుక ఇతరచోట్ల అమ్ముకునే వారివద్ద ఫీజు వసూలుచేయుహక్కు ఈ మార్కెటు కంట్రాక్టర్లకు లేదు. రోడ్ల మార్జినులందు దుకాణములు పెట్టినయెడల రోడ్లు అక్రమించినవారిని ప్రాసిక్యూటు చేయుటకు మున్సిపాలిటీవారికి హక్కుగలదు. వారివద్ద రెట్టింపు ఫీజు వసూలుచేయు యధికారముకూడ మునిసిపాలిటీవారిది కాని కంట్రాక్టర్లది కాదు. యెందుకనగా మార్కెటు కంట్రాక్టర్లు వేలమున పాడుకొనినది పైనుదహరించిన యైదు స్థలములు మాత్రమే.

అదే విధముగా బండ్లు, బండ్ల దొడ్డిలోనికి వచ్చినప్పుడే ఆ బండ్లవారి వద్దనుంచి ఫీజు వసూలు చేయవచ్చును. కాని ప్రస్తుతము ఈ బండ్లదొడ్డి కంట్రాక్టర్ల గుమాస్తాలు వూరికి నాలుగువైపుల కూర్చొని వస్తూపోయే బండ్లకు కూడ ఫీజు వసూలుచేయుచున్నారు. ఎవరైనను యీఫీజు యిచ్చుటకు నిరాకరించినయెడల యీ కంట్రాక్టర్ల గుమాస్తాలు దౌర్జన్యమునకు దిగుటకూడ జరుగుచున్నది.

మార్కెటు కంట్రాక్టర్లు చేయుచున్న అక్రమ వసూళ్ళను అరికట్టుటకని శ్రీయుత కాట్రగడ్డ పిచ్చయ్యగారు చాలా శ్రద్ధతీసుకొనిరి. వారు 29-6-38 న యీ అక్రమ వసూళ్ళ విషయమై మునిసిపల్ కమిషనరుగారికి తెలియచేసిరి. డివిజినల్ కాంగ్రెస్ కమిటీలు కరపత్రముల ద్వారా యీ అక్రమ ఫీజు యివ్వనవసరము లేదని ప్రచారముచేసిరి. 1-7-38 నుండి సోషలిస్టులు, కాంగ్రెస్‌వారు మార్కెటుదగ్గర బేరముచేయు వారితో మార్కెటు కంట్రాక్టర్లు అక్రమముగా వసూలుచేయు ఫీజును యివ్వనవసరము లేదని తెలియజేసి యీ బేరగాళ్ళను మునిసిపల్ కమీషనరువద్దకు తీసుకొనివెళ్ళగా కమిషనరుగారు వీధులవెంబడి తిరిగి అమ్ముకొను వారివద్దనుంచి యేవిధమైన ఫీజు వసూలు చేయుటకు వీలులేదని చెప్పిరి. తరువాత కూరగాయల బేరగాళ్ళ తరఫున పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు మునిసిపల్ కంట్రాక్టర్ల స్వయముగా యీ పురపాలక సంఘమునకు వైస్ చైర్మనుగారగు పోతిన గణపతిరావుగారితో యీ మార్కెటు ఫీజు విషయమై మాట్లాడుకొనిరి, చివరకు వైస్‌చైర్మను గారియెదుట, నెత్తిమీద పెట్టుకొని వీధులవెంబడి తిరిగి బేరము చేయువారి వద్దనుంచి ఫీజు వసూలు చేయమని చెప్పిరి.

కాని పచ్చిగడ్డి నెత్తిమీద పెట్టుకొని తిరిగి అమ్ముకొను వారివద్దనుంచి, శనగపప్పు అమ్ముకొను వారి వద్దనుంచి ఫీజు అక్రమముగా వసూలు చేయుచున్నారు. ఈనెల 9, 10 తేదీలందు సోషలిస్టులు కాంగ్రెస్ వర్కర్సు యీ అక్రమ వసూళ్ళు యివ్వనవసరములేదని వారికి తెలియచేసిరి. కంట్రాక్టర్ల గుమాస్తాలు కొంత ఘర్షణ సాగించిరి.

ఈ అక్రమ వసూళ్ళ విషయమై శ్రద్ధ తీసుకొని పట్టుదలతో పని చేయుచున్నందుకు మార్కెట్టు కంట్రాక్టర్లు శ్రీయుత కాట్రగడ్డ పిచ్చయ్యగారికి వారు కోర్టు ద్వారా నష్ట పరిహారార్థము కోర్టు ద్వారా చర్య తీసుకొనెదమని రిజిష్టరు నోటీసు పంపిరి.

మున్సిపాలిటీ కాంగ్రెస్ ఆధీనమందున్నప్పుడు యీ అక్రమ వసూళ్ళను సాగనివ్వకూడదు. నెత్తిమీద పెట్టుకొని వీధుల వెంబడి తిరిగి బేరము చేయువారికి లాభము చాలా స్వల్పమైనను, పురజనులకు మాత్రము చాలా సహాయము చేయుచున్నారు. కనుక అక్రమ వసూళ్ళను అపుదలచేసి కాంగ్రెసు ప్రతిష్ఠ యభివృద్ధి పరచెదరని యాశించుచున్నాము.

—ఒక పౌరుడు.

పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యనిర్వాహక వర్గ సమావేశము,

ది 15-7-38 ఉదయం 11 గంటలకు నర్సాపురం తాలూకా కాంగ్రెసు ఆఫీసు, పాలకొల్లులో ఈ క్రింది విషయములు చర్చించడానికి జరుగును.

1 కాశీపట్టణము రైతు సమస్య.
2 పార్టీ పత్రికయైన నవశక్తికి చందాదార్లను చేర్పించుటకు తగిన ఏర్పాట్లు.
3 కాంగ్రెసు సభ్యులను చేర్పించుట.
4 బెజవాడలో జరిగిన సి. యస్. పి. తీర్మానములు అమలు జరుపుటను గురించి.
5 జిల్లాలోని యువ జనోద్యమమును గురించి.
6 పార్టీయొక్క ఆర్థిక విషయము గురించి జరుగును.

ఉ. రామం,
కార్యదర్శి.

# సంస్థానాలలో దౌర్జన్యం మితిమీరు తున్నది!

## తిరువాన్కూరులో రౌడీలు—హైదరాబాదులో సత్యాగ్రహం—సికార్‌లో కాల్పులు

### తిరువాన్కూరు

తిరువాన్కూరులోని సంస్థాన కాంగ్రెసు, ప్రజలలో ద్రౌహ్య ప్రబోధం చేస్తున్నదనిన్నీ, సంస్థానంలో శాంతి భద్రతలకు భంగం కలుగ జేస్తున్నదనిన్నీ, కాబట్టి ప్రజలెవరూ కాంగ్రెసు ప్రచారకుల మాటలు విని మోసపోవద్దనిన్నీ ఈ మధ్య సంస్థాన ప్రభుత్వమొక హెచ్చరిక చేసింది. దానిపై తిరువాన్కూరు సంస్థాన కాంగ్రెసు యొక్క వర్కింగ్ కమిటీవారు ఒక పెద్ద జవాబు ప్రకటించారు. అది యీ క్రింది విధంగా ఉంది.

"చెంగన్నూరులో శాంతియుతంగా జరిగిన బహిరంగ సభను తప్పత్రాగిన రౌడీలు బుద్ధిపూర్వకంగా చెల్లాచెదురు చేశారని ప్రభుత్వమునకు అనుకూలమైన పత్రికా రిపోర్టులవల్ల కూడా స్పష్టమౌతుంది.... అసంఖ్యాకులుగా సమావేశమైయున్న ప్రజలు ఎంతో శాంతముగా ఉన్నప్పటికీ, పోలీసులు అనేకసార్లు లాఠీఛార్జి చేశారు. చెదిరిపోవలసిందని ముందుగా హెచ్చరిక చూడ లేయక అక్రమంగా ప్రజలపైబడి కొట్టారు.

"మేము ద్రౌహ్య ప్రచారం చేస్తున్నామని ప్రభుత్వము అంటూంది. దౌర్జన్య కరమైన ఒక్క పనినిగాని, ఒక్క స్టేట్‌మెంటును గాని వెలెత్తి చూపవలసిందిగా మేము ప్రభుత్వాన్ని సవాలు చేస్తున్నాం."

"మా ఉద్యమానికి బలమైన వ్యతిరేక పార్టీ ఒకటి ఉన్నదని ప్రభుత్వం అంటూంది. కాని, ఆ వ్యతిరేక పార్టీ యేదో పేర్కొన వలసిందని మేము ప్రశ్నిస్తున్నాం."

కాని ప్రభుత్వమే కొంతమంది తుంటరులను దిద్దిచి, ఒక వ్యతిరేక పార్టీని లేవదీసి, వీరి కొరకు మీ ప్రచారం మానివేయాలని కాంగ్రెసుతో చెప్పవచ్చు! తిరువాన్కూరు సంస్థానంలో యిన్ని అఘాయిత్యాలు చేయిస్తూన్న సంస్థాన ప్రభుత్వం యీ పని చేయడానికి జంకదు.

### నిషేధాజ్ఞలు.

చెంగన్నూరులో జరిగిన బహిరంగసభలో కాంగ్రెసు నాయకుల్ని బహిరంగంగా తుంటర్లు, పోలీసులు కలిసి హింసించడం చాలక, కాంగ్రెసు ప్రచారకులపై మరొక ఆజ్ఞ విధుమబడింది. క్విలోన్, కొట్టాయాం జిల్లాకలెక్టర్లు 2 నెలల వరకూ ఆరెండు జిల్లాలలోను కాంగ్రెసుతరఫున సభలు, ఊరేగింపులు, ప్రదర్శనాలు జరుపకూడదంటూ నిషేధాజ్ఞలు చేశారు. వీటికి కారణం, చెంగన్నూరు మొదలైన స్థలాలలో జరిగిన అల్లరులేనని ప్రకటించారు.

గొరుమట్టుపై రోకటిపోటు అన్నట్లు, దౌర్జన్యంగా మీదపడికొట్టిన రౌడీలను విచ్చలవిడిగా వదిలేసి, తిరిగి కాంగ్రెసువారులమీద నేరారోపణ, రాదోయ ఫెడరేషనలోనే యిట్టివల్లని ప్రభువులంటే, ఇక చెప్పేదేమున్నది!

### వాలంటీర్ల దళం

తిరువాన్కూరు సంస్థానకాంగ్రెసు, సత్య

తీవ్రంగా పూనుకుంటూఉంది, ముఖ్యంగా బహిరంగసభలో తుంటరులు అల్లరి చేయకుండా కాపాడ్డానికి తగిన శిక్షణయిచ్చుటకు ఒకదళ్ళని వాలంటీరుదళాన్ని కూడా స్థాపించ బోతున్నారు. పౌరసత్వ హక్కు ప్రాణము వంటిది.

కేరళ యువజన సంఘాధ్యక్షుడైన జి. రామచంద్రన్ గారు యీ విధంగా వ్రాస్తున్నారు. "ఈమధ్య జరిగిన ఘటనలను బట్టి ఆలోచిస్తే, తిరువాన్కూరు సంస్థానంలో నేడు పౌరసత్వ హక్కులను కాపాడుకోవటానికొక తీవ్రమైన ఉద్యమం అవసరమని తోచక మానదు. పౌరసత్వ హక్కుల రక్షణ రాజకీయ సమస్యకాదు; కాని అన్ని రాజకీయ సమస్యల కంటె అది ప్రధానమైనది. ప్రజలు తమకు గల శక్తిద్వారా పౌరసత్వ హక్కుల రక్షించుకోలేకపోతే, ఎంతఅధోగతిలోనైనాపడుట కష్టంలు. పౌరస్వాతంత్ర్యం ప్రతిపౌరునికి ప్రాణము వంటిది. అదిలేకపోతే, పౌరసత్వం అనేది హాస్యాస్పదంకాక మానదు. జూలై ఆఖరు వారంలో అఖిల తిరువాన్కూరు పౌర స్వాతంత్ర్య మహాసభ జరుగును. దానిలో అఖిల తిరువాన్కూరు పౌర స్వాతంత్ర్య సమితి అనే శాశ్వత సంస్థ ఒకటి స్థాపింప బడుతుంది. ప్రజలెల్లరు ఈ ప్రయత్నానికి తోడ్పడాలని కోరుతున్నాను."

నిజంగా తిరువాన్కూరులో నేటి సమస్య పౌరసత్వ హక్కుల రక్షణ అని చెప్పాలి. ప్రజల వోటు హక్కుకంటె, బాధ్యతాయుత పరిపాలన కంటె కూడా ప్రధానమైన సమస్య నేడు పౌరసత్వ హక్కుల రక్షణ. స్వేచ్ఛగా అందరూ ఒకచోట సమావేశం కావడానికి హక్కు ఉండాలి. స్వేచ్ఛగా సభలలో మాట్లాడుకోవడానికి హక్కు ఉండాలి. స్వేచ్ఛగా వీధుల్లో నడచుటకు హక్కు కావాలి. ఇండ్లలో చొరబడి అల్లరి చేసే తుంటరుల నుండి రక్షణ కావాలి. ఎన్ని రాజకీయ సంస్కరణాలు వచ్చినా, ఇవి లేకపోతే బూడిదలో పన్నీరే! కాబట్టి, పై అఖిల తిరువాన్కూరు పౌరస్వాతంత్ర్య మహాసభ జయప్రదంగా జరుగుతుందని ఆశిస్తున్నాం.

### బాధ్యతాయుత పరిపాలన

స్వదేశ సంస్థానాలలో నేడు బాధ్యతాయుత పరిపాలన లేదన్న సంగతి అందరికీ తెలిసిన విషయమే. సంస్థానాధీశ్వరుని యాజమాన్యం క్రిందనే ప్రజాప్రాతినిధ్యం గల ప్రభుత్వం కావాలంటూ నేడు అనేక సంస్థానాలలో ఆందోళన చేస్తున్నారు. తిరువాన్కూరు సంస్థాన కాంగ్రెసు యొక్క వర్కింగ్ కమిటీవారు మొన్ననే 200 పుటలుగల మెమోరాండం ఒకదాన్ని ప్రకటించారు దాని ప్రకారం,

1. నేటి దివాన్ యొక్క అధికారాలు ప్రజా ప్రతినిధులచే ఎన్నుకోబడిన మంత్రులకీయాలి. సంస్థానాధీశ్వరునికి మాత్రం ప్రత్యేకాధికారాలు ఉండవచ్చు.

2. వయోజనుల అందరికీ వోటుహక్కు ఈయబడాలి.

3. ఎసంబ్లీ అధ్యక్షుని ఎసంబ్లీ మెంబర్లే ఎన్నుకోవాలి.

4. వాక్స్వతా పత్రికా స్వాతంత్ర్యాలుగుర్తించి ప్రకటన చేయాలి.

5. కార్మికులకు కనీస వేతనం, న్యాయమైన జీవిత సౌకర్యాలు ఈయాలి.

6. న్యాయశాఖను కార్య నిర్వాహకశాఖనుండి వేరు చేయాలి.

7. పత్రికా శాసనాన్ని రద్దు చేయాలి.

8. నేడు సంస్థానంలో ఉన్న పరిస్థితులను గురించి సాకల్యంగా విచారణ జరపాలి.

పై మెమోరాండంను ఎంతోమంది విద్యాధికులు, మేధావంతులు అయిన కాంగ్రెసు నాయకులు కూర్చొని తయారు చేశారు. కాని, జరిగినదేమి? ఆ గ్రంథం తిరువాన్కూరు సంస్థాన సరిహద్దులలోనికి రాకూడదని ప్రభుత్వ నిషేధాజ్ఞ! ప్రజాభి ప్రాయమంటే యింతభయం ఇంత గాభరా ఎందుకో?

### మైసూరు

"ప్రజాశక్తి" అనేపత్రిక మైసూరు సంస్థానంలోనికి రాకూడదనిన్నీ; సంస్థాన సరిహద్దులలో ఎవరివద్దనున్నప్పటికీ పోలీసులు లాక్కోవచ్చుననిన్నీ ప్రభుత్వమొక నిషేధాజ్ఞ యిచ్చింది. బెంగుళూరులోను, చికమగలూర్‌లోను పోలీసులు రైల్వేస్టేషనులోనే అనేక ప్రతులను పట్టుకొని తీసుకెళ్ళారు. ఈ పత్రిక సంస్థానంలోకివస్తే శాంతి భద్రతలకు భంగం కలుగగలదు కాబట్టి యీవిధంగా నిషేధిస్తున్నామని మైసూరుగవర్న మెంటు ప్రకటించింది.

పత్రికచదివితేనే భంగంకలిగేశాంతి భద్రతలు ఎట్టివో పాఠకులే ఊహించుకొందురు గాక!

### హైదరాబాద్

ఎన్నో సంవత్సరాలనుంచి హైదరాబాద్ సంస్థానంలో 53 వ గస్తీ అనేపేరుతో ఒక నిరంకుశచట్టం అమల్లోఉంది. దాని ప్రకారం ఎట్టి బహిరంగసభలు, ఊరేగింపులు ప్రభుత్వ అనుమతిని తీసుకోకుండా జరుపకూడదు. ఇప్పుడాగస్తీ తొలగించబడి కొత్తచట్టం ఒకటి చేయబడింది. దానిప్రకారం సామాజిక, సారస్వత, విద్యావిషయక, దానధర్మసంబంధమైన సభలను ఊరేగింపులను ప్రభుత్వానుమతిని పొందకుండానే జరిపించుకోవచ్చును. కాని తదితరసభలకు యధా ప్రకారంగానే అనుమతి అవసరము.

అనగా, మత సంబంధ మైనట్టియు, రాజకీయ సంబంధ మైనట్టియు సభలు జరుగ రాదనియే దీని భావం. మత కలహాలు జరుగకుండా చేయుటకే ఈ మార్పు అని ప్రకటలో ఉంది. కాని, యిది పేరుకు మాత్రమే! నేడు స్వదేశ సంస్థానంలో చూచినా, ప్రజలు బ్రహ్మాండమైన రాజకీయ చైతన్యాన్ని పొందుతున్నారు. డాక్టరు పట్టాభిగారు, కె. యఫ్. నారిమన్‌గారు హైదరాబాద్ వస్తే ప్రజలలో మత కలహాలు బయల్దేరుతాయనియేనా వారిని రానీయకుండా నైజాం ప్రభుత్వం నిషేధించింది, వీరుభయులూ కూడా కాంగ్రెసు ప్రముఖులేనని మెలరికీ తెలిసిన విషయమే. వీరు వస్తే, ఇతర సంస్థానాలలోవలె హైదరాబాదులో కూడా రాజకీయ చైతన్యం వృద్ధి చెందుతుందనే గాభరా వల్లనే యిట్టి నిషేధాజ్ఞలు, చట్టములలో యిట్టి మార్పులు!

కొత్తగా స్థాపించబడిన హైదరాబాద్ సంస్థాన కాంగ్రెసు యిట్టి నిరంకుశ చట్టాలను, నిషేధాజ్ఞలను రద్దు చేయించడానికి సత్యాగ్రహం ఆరంభించబోతూ ఉందని తెలుస్తూ ఉంది.

### ఒరిస్సా.

ఒరిస్సారాష్ట్ర మండలి సంస్థాన ప్రజల కదగంప్లు నవశక్తి పాఠకులు చదివే ఉంటారు. వాటిని సాకల్యంగా విచారణ చేయుటకు విచారణ కమిటీ అనేక మంది వద్దతీసాక్ష్యాలు తీసుకొంటూంది. మారు మూలలనుండి వివిధ సంస్థాన ప్రజలు ఉత్సాహంతో వస్తున్నారు సాక్ష్యం ఇవ్వటానికి. విచారణ మొన్ననే ముగిసియుండేది. కాని, ఇంకా ఎన్నో స్థలాల్లోనుంచి ప్రజలు వస్తున్నారనే వార్తతెలిసి, మరొక 2 నెలలవరకు సాక్ష్యంతీను కొనబడు తుందని తీర్మానించారు.

### కట్టక్

అఖిల భారత సంస్థాన ప్రజల మహాసభ యొక్క కార్యదర్శి బలవంత్రాయి మెహతా గారు కట్టక్ పుర మందిరంలో ఉపన్యసిస్తూ, యీ విధంగా చెప్పారు.

"ప్రజలకోరికలు న్యాయమైనవి. పౌరసత్వ హక్కులకొరకు రాజ్యాంగ సంస్కరణముల కొరకు వారు చేసేపోరాటాన్ని పట్టుదలతో సాగిస్తే తప్పకజయం పొందుతారు. త్వరలో వారికి సంపూర్ణవిజయం సిద్ధించగలదు. ఇదే ఒరిస్సా సంస్థానప్రజలకు నేనిచ్చు సందేశం".

### ఇందూరు

ఇందూరు సంస్థానంలో పౌరసత్వహక్కులకై జరుగుతూన్న భంగానికి అసమ్మతి తెలుపుతూ హజరిలాల్ జరియా అను ఒకసుప్రసిద్ధ కాంగ్రెసు ప్రచారకుడు నిరశనవ్రతం ప్రారంభించాడు.

కాని, యితరసంస్థానాలలోవలె ఇందూరులో కూడా పౌరసత్వహక్కుల రక్షణకై పెద్దప్రజా ఉద్యమాన్ని లేవదీసినట్లయితే హజారిలాల్ గారి ప్రయత్నాలు సఫలమయ్యేవి.

### సికారు ప్రజలపై కాల్పులు.

జయపూరు సంస్థానానికి సామంతుడైన సికారు ప్రభువుకు, జయపూరు రాజాకు దెబ్బలాటలు బయల్దేరాయి. ఆర్థిక బాధలవల్ల కల్గిన ప్రజా అసంతృప్తిని సికారు రాజు, జయపూరు రాజుపై త్రిప్ప గల్గారు. ప్రజలు తమ కోర్కెల కోసం ఆందోళన సమ్మె చేస్తూ ఉంటే, జయపూరు సైనికులు కాల్చారు, చాలమందికి గాయాలు తగిలాయి. 14 మంది చనిపోయారు. ప్రజల ప్రాణాలంటే మహారాజాలకు గడ్డి వరకల్లాగుంటాయి!

